# ఆంధ్రపత్రిక



3|9|92

THE ANDHRA PATRIKA- MADRAS. సంపుటం 43. సంచిక 4 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO బుధవారం 4-4-1956 Reg. No. M. 1118. 6 పేజీలు 1 అణా

# 'ఆంధ్రప్రదేశ్' అనే పేరుకు తెలంగాణా నాయకుల సమ్మతి

## గరివిడిలో ఫెర్రోమాంగనీస్, మాంగనీస్ ఖనిజశుద్ధి ఫ్యాక్టరీలకు శంకుస్థాపన

### రాష్ట్రంలో ఎంతప్రయత్నించినా పాతికలక్షలైనా పెట్టుబడి లభించలేదని శ్రీ వెంకటరావు విచారం

(స్వకీయ విలేఖరి)

విజయనగరం, మార్చి 31: "ఆంధ్ర దేశంలో నూతన పరిశ్రమల స్థాపనకు తగినంత పెట్టుబడి లభించకుండా వుండడం విచారించవలసిన విషయం. పై రాష్ట్రాలవారు మన రాష్ట్రంలో పెట్టుబడులు పెడుతున్నారంటే దానికి కారణం ఇదే. దేశశ్రేయస్సుకు ఎంతగానో ఉపకరించే ఈ "ఫెర్రో-మాంగనీస్" ఫ్యాక్టరీకి మన రాష్ట్రంలో పెట్టుబడి పెడుతున్న దుర్గాప్రసాద్ మరాఫ్, నర్సింగదాస్ మోరే గారలను మనం అభినందించవలసి వుంది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఈ రాత్రి పన్నెండుగంటలకు పూర్తిఅయి, రేపు ద్వితీయపంచవర్ష ప్రణాళిక అమలులోకి రానున్న ఈ శుభసమయంలో జాతీయ ప్రాధాన్యంగల ఈ ఫ్యాక్టరీకి శంకుస్థాపన చేయడం నాకు చాలా సంతోషంగా వుంది" అని "గరివిడి" గనుల వద్ద నెలకొల్పనున్న ఫెర్రో మాంగనీస్ ఫ్యాక్టరీకీ మాంగనీస్ శుద్ధిచేసే ఫ్యాక్టరీలకు శంకుస్థాపన చేస్తూ మంత్రి శ్రీ కళా వెంకటరావు అన్నారు.

శంకుస్థాపనోత్సవ సభ శ్రీ సోమసుందరం అధ్యక్షతన జరిగింది.

శ్రీ వెంకటరావు ఇలా అన్నారు. ఈ "ఫెర్రో—మాంగనీస్" ఫ్యాక్టరీకి రూ. 2,50,00,000 పెట్టుబడి అవసరం. ఆంధ్రదేశం అంతా తిరిగినా పాతికలక్షలు పెట్టుబడి లభించడం లేదు. ఈ కారణం వలన ఇతర రాష్ట్రాలవారు ఎవరయినా సరే ఆంధ్ర దేశంలో పరిశ్రమలు నెలకొల్పడానికి ముందుకు వస్తే వెంటనే వారికి అనుమతి ఇవ్వాలని మంత్రివర్గంలో నిర్ణయించాము. నేడు ప్రథమ పంచవర్ష ప్రణాళిక పూర్తిఅయి, రేపు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో అడుగు పెడుతున్నాము. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో దేశంలో వ్యవసాయ అభివృద్ధికి ఎక్కువగా వ్యయం చేశాము. ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పరిశ్రమల స్థాపనకు ఎక్కువ ధనాన్ని కేటాయించడం జరిగింది."

"ప్రణాళికలు అంటే ఏమిటో తెలియని పరిస్థితిలో చాలామంది వున్నారు. దేశంలో సగటున నిముషానికి ఏడుగురు చొప్పున మన జనాభా పెరుగుతున్నది. అంతే కాకుండా సగటు మరణసంఖ్య తగ్గుతున్నది. ఈ విధంగా పెరుగుతున్న జనాభాకు చిన్న, పెద్ద పరిశ్రమల ద్వారా వృత్తి కల్పించవలసి వుంది. ఈ ఫ్యాక్టరీ మనరాష్ట్రంలో అనేకమందికి వృత్తి కల్పించగలదని ఆశిస్తున్నాను."

### విద్యుచ్ఛక్తి సప్లయ్

"ఈ ఫ్యాక్టరీకి అత్యధికమయిన విద్యుచ్ఛక్తి కావలసివుంది. మాచ్ ఖండు నుంచి వచ్చే లక్ష కిలోవాట్లలోనూ పాతిక వేల కిలోవాట్లు ఈ ఒక్క ఫ్యాక్టరీకే అవసరం. మరి పాతిక వేల కిలోవాట్లు విశాఖలోని కార్ఖానాకు కావాలి. ఈ ఫాక్టరి ఒక్క పెట్టుబడిదార్లకే కాకుండా కార్మికుల శ్రేయస్సుకు కూడా తోడ్పడగలదని నా నమ్మకం.

ప్రథమంలో సేట్ శ్రీ దుర్గాప్రసాద్ మరాఫ్ అందరికీ స్వాగతం చెప్పుతూ ఇలా ప్రసంగించారు: 'ప్రథమ పంచవర్ష ప్రణాళిక ముగిసి, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో అడుగుపెడుతున్న ఈ దినం మనకి చాలా సుదినం. ఈ సందర్భంలో ఈ పరిశ్రమకి సంబంధించిన కొన్ని వివరాలు సభికులకి తెలియచేయడం నా కర్తవ్యం అనుకుంటాను. ముందుగా ఆర్. వి. శ్రీరాం అండ్ కంపెనీ (ప్రైవేటు) లిమిటెడ్ స్థాపించనున్న "మాంగనీస్ ఖనిజ శుద్ధి ఫ్యాక్టరీ" విషయం ప్రస్తావిస్తాను. ఈ ఫ్యాక్టరీ ముడిసరుకును కొంతమటుకు శుద్ధిచేసి, ముడిసరుకులోని అనవసర పదార్థాన్ని వేరుచేస్తుంది. ఇప్పటికి ప్రపంచం మొత్తం మీద భారతదేశంలోని "మాంగనీస్ ఖనిజానికి ఎక్కువగా గిరాకీ వుంది. ఆంధ్రదేశంలో అనేక ప్రదేశాలలో మాంగనీస్ ఖనిజ సంపద ఎక్కువగా వున్నా ఈ విధమయిన శుద్ధిచేసే పరిశ్రమ లేక పోవటం వలన తగిన ప్రయోజనాలు మనకు కలగకుండా లేదు, భారతదేశం అంతటికి ఈ విధమయిన ఫ్యాక్టరీలు రెండేరెండువున్నా, ఇక్కడ స్థాపించనున్న ఈ ఫ్యాక్టరీ కొన్ని విషయాలలో ప్రథమస్థానం వహిస్తుంది. ఈ ఫ్యాక్టరీకి పశ్చిమ జర్మనీకి చెందిన మెసర్స్ ఐడాన్ కంపెనీ యంత్రాలు సరఫరాచేయుటమే కాకుండా మనవారికి సాంకేతిక శిక్షణ ఇచ్చి

4 వ పేజీ 8 వ కాలం చూడుడు

### మాచ్ ఖండ్ లో మట్టి మేట తొలగించే పథకం

విశాఖపట్టణము, మార్చి 30: మాచ్ ఖండ్ వద్ది రిజర్వాయర్లలో మట్టి మేట వేసుకోవడం తగ్గించటానికి తుదకు సంపూర్తిగా ఈ మట్టిముంపు ఆపి వేయుటానికి ఒకపథకాన్ని అరకులోయలో కట్టడానికి రూ. 6 లక్షలు కేంద్రప్రభుత్వం మంజూరుచేశారు.

గిరిజనులు పోడు వ్యవసాయం చేయడంవల్లనూ, ప్రతి సంవత్సరమూ 120 అంగుళాలకుపైగా వర్షం కురుస్తూండడం వల్లనూ — మాచ్ ఖండ్ వద్ది మేట వేయటమూ జల విద్యుత్ నిర్మాణాలవద్ద మేట వేయటమూ జరుగుతున్నది.

ప్రస్తుత పథకం అమలులోకి వచ్చిన తరువాత ఈ మెట్ట వేయటం ఆగి— అక్కడి వ్యవసాయభూములు సారవంతం అవుతాయని ప్రభుత్వ భావం. (స్వ. వి.)

### శ్రీ వి. కె. కృష్ణమీనన్

లండన్ ఏప్రిల్ 2: ఐక్యరాజ్య సమితి ధర్మకర్తృత్వ సంఘ చర్చలలో పాల్గొని, న్యూయార్కు నుంచి, శ్రీ వి. కె. కృష్ణమీనన్, ఇక్కడికి వచ్చారు. కొద్దిరోజులలో ఢిల్లీకి బయలు దేరుతారు.

## 72 మంది సభ్యులతో ఎగువ శాసన సభ

కర్నూలు, ఏప్రిల్ 3: నూతన ఆంధ్ర రాష్ట్రానికి 72 మంది సభ్యులతో ఎగువసభ ఉండాలని ఆంధ్ర, తెలంగాణా ప్రాంత నాయకులు ఇవాళ ఏకగ్రీవంగా నిర్ణయించారు.

ఈ విషయాన్ని నాయకుల సమావేశం అనంతరం ఉభయ రాష్ట్రాల కాంగ్రెస్ అధ్యక్షులు పత్రికా ప్రతినిధుల సమావేశంలో ప్రకటించారు.

బిల్లులో రెండు నిబంధనలకు సవరణలు సూచించాలని ఏకగ్రీవంగా తీర్మానించినట్లు రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు తెలియపరిచారు. ఇప్పుడున్న ఈ రాష్ట్రాన్ని కొత్త రాష్ట్రంగా పేర్కొనాలని ఒక సవరణ సూచిస్తుంది.

ఇది ఏదో చిన్న భాషా మార్పువంటిది కాదు. ఈ మార్పుతో శాసన సభ స్వరూపమే మారిపోతుంది మారు. మందికిపైగా శాసనసభ్యులు అదనంగా కలుస్తారు కాబట్టి ఇది అవసరం అని శ్రీ నరసింగరావు వివరించారు.

శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు ఇంటిలో కల్పించుకుని, ఆంధ్ర శాసన సభలో కూడా ఆ సవరణ ప్రతిపాదిస్తారని చెప్పారు.

ఈ సందర్భంలో ఇదిగా చెప్పిన వానికున్న న్యాయశాస్త్రసమ్మతం ఏమిటని ప్రశ్నించగా, లోటేమీ లేదా ఉందని శ్రీ రాజు చెప్పారు.

అంటే కొత్త రాష్ట్రం కొత్త రాష్ట్రంగానే వ్యవహరించాలని ఉద్దేశం అని విశదీకరించారు. మధ్యకి పరిస్థితి ఎన్నిక మొదలైనవన్నీ తిరిగి కొత్తగా జరిగించాలి.

ఆంధ్రశాసన సభ జీవితకాలాన్ని పొడిగించాలనీ, ఇందుకు అవసరమైతే రాజ్యాంగంలోని 172 నిబంధనకు, షెడ్యూల్లో 26, 27 నిబంధనలకు సవరణలు చేయాలని భారత ప్రభుత్వానికి సూచించడానికి తీర్మానించారు.

పేరును గురించిన క్లిష్ట సమస్యను చర్చించి చివరికి ఒక నిర్ణయంచేశాము" అని శ్రీ నరసింగరావు చెప్పారు.

శ్రీ ప్రకాశంగారు కూడా ఆంధ్రప్రదేశ్ అనేపేరును సమ్మతించవలసిందిగా హైదరాబాద్ నాయకులకు విజ్ఞప్తి చేశారని ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షుడు తెలిపారు.

### సరిహద్దు నిర్ణాయక సంఘాలు

నూతనరాష్ట్రంతో, కర్ణాటక, మహారాష్ట్ర, ఒరిస్సా, మధ్యప్రదేశ్‌ల సరిహద్దుల విషయమై సరిహద్దు నిర్ణాయక సంఘాన్ని నియమించవలసిందిగా భారతప్రభుత్వాన్ని కోరడానికి ఉభయప్రాంతాల నాయకులూ నిర్ణయించారు.

మద్రాసు సరిహద్దు మాటేమిటి అని ప్రశ్నించగా, అది రాయబారాలకు విడిచిపెడుతున్నారని శ్రీ సత్యనారాయణరాజు చెప్పారు.

1962 వరకూ తెలంగాణాకు విడి ప్రదేశ్ కాంగ్రెస్ ఉంటుందని శ్రీ నరసింగరావు చెప్పారు.

ప్రభుత్వశాఖల విలీనం, కార్యాలయాల స్థాపనం, మొదలైనవానివిగురించి కూడా చర్చించినట్లు చెప్పారు.

నీని విషయమై మంత్రులూ, ప్రభుత్వాధికారుల చర్చలు జరుగుతాయన్నారు.

ప్రామిత్య కార్యాలయం, శాసనసభాభవనాల నిర్మాణానికి కార్యక్రమాలు సిద్ధంగా ఉన్నాయని శ్రీ నరసింగరావు చెప్పారు.

## కోస్తాజిల్లాలకోసం గుంటూరులో హైకోర్టు బెంచి నెలకొల్ప నిర్ణయం

### అక్టోబర్ లోగా విలీనం మినహా కార్యాలయాల తరలింపు అసాధ్యం అని డా॥ బూర్గుల ప్రకటన

[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

కర్నూలు, ఏప్రిల్ 3: "ఆంధ్ర ప్రదేశ్"అని నూతన రాష్ట్రానికి పేరు పెట్టడానికే చివరికి ఆంధ్ర, తెలంగాణా నాయకులు తీర్మానించారు.

ఆంధ్ర ప్రాంత న్యాయవాదుల ప్రాబల్యానికి హైదరాబాదు న్యాయవాదులు భయపడుతున్న కారణంవల్ల, రాయలసీమపై న్యాయ విచారణాధికారాన్ని హైదరాబాద్ కోర్టుకు ఒప్పగించి, కోస్తాజిల్లాలకోసం గుంటూరులో హైకోర్టు బెంచి నెలకొల్పాలని కూడా ఉభయప్రాంత నాయకులూ నిర్ణయించారు.

మిగిలిన ఈ రెండు వివాదాంశాలపైనా ఏకాభిప్రాయానికి రావాలనే ఉద్దేశంతో, కర్నూలులో ఇవాళ ఏర్పాటయిన ఆంధ్ర, తెలంగాణా నాయకుల సమావేశం ఫలించిందని ఈ నాయకులలో ప్రతి ఒక్కరూ హర్షం ప్రకటించారు.

ఆంధ్ర ముఖ్య మంత్రి కార్యాలయంలో జరిగిన ఈ సమావేశంలో ఆంధ్రముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, హైదరాబాద్ ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణారావు, హైదరాబాద్ రెవిన్యూమంత్రి శ్రీ కె. వి. రంగారెడ్డి, ఆంధ్ర ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి, హైదరాబాద్ వ్యవసాయమంత్రి డా॥ చెన్నారెడ్డి, హైదరాబాద్ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ జె. వి. నరసింగరావు, ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు, ఆంధ్ర కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, పూర్వ ఆంధ్రముఖ్యమంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశం, విశాలాంధ్ర మహాసభాధ్యక్షులు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పాల్గొన్నారు.

### ఆంధ్ర, తెలంగాణా పేర్లు వేర్వేరు కావు

నూతన రాష్ట్రం నామకరణం విషయమై కొంత దీర్ఘ చర్చ జరిగింది. హైదరాబాద్ నాయకులలో శ్రీ రంగారెడ్డి, డా॥ చెన్నారెడ్డి, శ్రీ నరసింగరావు "తెలుగు ప్రదేశ్" అని కాని "తెలంగాణా" అని కాని కొత్తరాష్ట్రానికి పేరు ఉంచాలని దీర్ఘవాదం చేశారు.

### "ఆంధ్ర"లో దోషంలేదు

తదితరులు—హైదరాబాద్ ముఖ్యమంత్రితోసహా — "ఆంధ్ర" అనే మాటలో దోషం ఏమీలేదని వాదించారు. ఆ పేరు ఉపనిషత్తులకాలం నుంచీ వ్యవహారంలోఉంది. ఆ పేరు ఐతరేయ బ్రాహ్మణంలో కనపడుతుంది. ఆంధ్ర పితామహ, శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము ఈ మొదలైన ప్రఖ్యాతి వ్యవహారనామములను బట్టి చూచినట్లయితే, ఆంధ్రప్రజలకు తెలంగాణా ప్రజలు అనే భేదం కనపడదు. అందరినీ "ఆంధ్ర" అనే పేరుతోనే వ్యవహరించారు.

చివరికి "ఆంధ్రప్రదేశ్" అనే నూతనరాష్ట్రానికి పేరు ఉంచాలని అందరూ ఏకాభిప్రాయానికి వచ్చారు.

### ముస్లిం అవసరాలు

సమావేశానికి ముందు హైదరాబాద్ ముఖ్యమంత్రి "ఆంధ్రపత్రిక ప్రతినిధి"తో ప్రసంగిస్తూ, "తెలంగాణా" అనే పేరు రెవిన్యూ అవసరాలకోసం ముస్లిం పరిపాలకులు వ్యవహారంలోకి తెచ్చినదన్నారు. "ఆంధ్రప్రదేశ్" అనే పేరే అందరికీ సమ్మతం కాగలదనికూడా చెప్పారు.

### హైదరాబాదులో కార్యాలయాలకు వసతి

ఇక నిర్మించవలసిన నూతన ఆంధ్ర

(4వ పేజీ 5వ కాలం చూడుడు)

## మళ్లీ భద్రతామండలిలో కాశ్మీరు సమస్య

### పూర్వపు తీర్మానం పాటించాలని పాకిస్తాన్ కోరే సూచన

కరాచీ, ఏప్రిల్ 2: కాశ్మీరు వివాదాన్ని తిరిగి భద్రతామండలికి సమర్పించడం జరగవచ్చునని పాకిస్తాన్ ప్రభుత్వ సన్నిహితవర్గాలు తెలియచేస్తున్నారు.

కాశ్మీరు సమస్య పరిష్కారంకోసం జనవాక్య సేకరణ జరపాలని ఐక్యరాజ్య సమితి ఇదివరలో చేసిన తీర్మానాన్ని అమలు జరిపించాలని పాకిస్తాన్ భద్రతామండలిని కోరవచ్చునని ఈ వర్గాలు చెపుతున్నారు.

భద్రతామండలికి ఈ విజ్ఞప్తి చేసే ముందు, కాశ్మీరుపై శ్రీ నెహ్రూ వెలిబుచ్చిన అభిప్రాయాలతో ఎంతమాత్రం ఏకీభవించదలేదనీ, జనవాక్యసేకరణ ఒక్కటే న్యాయమైన పరిష్కారమార్గమనీ పాకిస్తాన్ ప్రభుత్వం తమ అభిప్రాయం భారతదేశానికి తెలియపరచగలదట.

### ఆజాద్ కాశ్మీర్‌లో సైనిక స్థావరాలు లేవని పాక్ ప్రభుత్వ ప్రకటన

కరాచీ, ఏప్రిల్ 1: పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీర్ ప్రాంతంలో సైనిక స్థావరాలున్నాయని శ్రీ నెహ్రూ చెప్పినమాట పూర్తిగా అబద్ధం అని పాకిస్తాన్ ప్రభుత్వం ప్రకటించింది. అక్కడేకాదు, ఉత్తర ప్రాంతంలో కాని, పాకిస్తాన్‌లో మరెక్కడ కాని అటువంటి స్థావరాలేవీలేవు. అని ఈ ప్రకటన వివరించింది.

పాకిస్తాన్ విదేశాంగశాఖాధికారి ఒకరి విషయాన్ని తెలుపుతున్నారు. అంటూ పాకిస్తాన్ ప్రభుత్వం ఈ పత్రికా ప్రకటన చేసింది. భారత ప్రధాని కేవలం ఊహా ప్రపంచంలో వున్నారని ఆ అధికారి అన్నారు.

కాశ్మీరులో జనవాక్యసేకరణ వాగ్దానాన్ని భంగపరచడంలో భారత ప్రధాని మరో అడుగు ముందుకు వేశారని రేడియో పాకిస్తాన్ వార్తలో చెప్పింది.

### ఎంత త్యాగానికైనా సరే సిద్ధం

#### పాక్ అధ్యక్షుని ప్రకటన

లాహోర్, ఏప్రిల్ 2: "కాశ్మీరు విమోచనకోసం ఎంత త్యాగం చేయ్యవలసినా సరే పాకిస్తాన్ జనుదియ్యారు" అని పాకిస్తాన్ అధ్యక్షుడు శ్రీ ఇస్కం

4 వ పేజీ 5 వ కాలం చూడుడు

## నీగ్రోలు బస్సు రవాణా సంస్థ పెట్టుకోరాదు!

### అమెరికాలో అధికారం తీరు

మాంట్ గామరీ (అలబామా) ఏప్రిల్ 1: నీగ్రోల కోసం ప్రత్యేకం ఒక నీగ్రో బస్సు కంపెనీ స్థాపించడానికి అనుమతించాలని నీగ్రో ఫాదిరీ రెవరెండ్ కింగ్ చేసిన విజ్ఞప్తిని ఇక్కడ పురపాలకాధికారులు నిరాకరించారు.

జాతివిచక్షణ మాని ఇప్పటి బస్సు సంస్థలే అందరికీ సరిపోతాయని అధికారుల సమాధానం.

కనీసం నీగ్రోప్రాంతాల్లో నడిచే బస్సుల్లో నీగ్రో డ్రైవర్లని నియమించాలని కోరితే, అది బస్సు యజమానులే నిర్ణయించుకోవాలంటూ అధికారులు జోక్యం చేసుకోడానికి నిరాకరించారు.

(బస్సు లెక్కచేయకుండా కట్టు కట్టిన "నేరానికి" రెవరెండ్ కింగ్‌కి ఇటీవల అధికారులు 500 డాలర్లు జరిమానా విధించారు)

### పాఠశాలల్లో విచక్షణకు కోర్టు నిరాకరణ

వాషింగ్టన్, ఏప్రిల్ 2: ఓహియో రాష్ట్రం, హైస్కూలు ప్రాథమిక పాఠశాలల్లో నీగ్రోవిద్యార్థులను కూడా చేర్చుకోవాలంటూ సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చింది. (ఆ పాఠశాలల్లో ఇంతవరకు నీగ్రోలను చేర్చుకోవడంలేదు.) విచక్షణ మానాలంటే కొందరపడకూడదని తమ ఉద్దేశమనీ, క్రమేణా మానడానికి అనుమతి ఇవ్వాలని పాఠశాలాధికారులు కోరారు. అది వీల్లేదని దిగువ న్యాయస్థానం తీర్పు ఇచ్చింది. దానిపై అప్పీలును సుప్రీంకోర్టు నిరాకరించింది.

అయితే సుప్రీంకోర్టుని మరోసారి విచారించాలని కోరేహక్కు పాఠశాలాధికారులకు ఉంది. వారుఅలా అడిగితే, రెండోతీర్పు వచ్చేలోగా అధికారులు విద్యార్థుల్ని ప్రవేశపెట్టే తంతుపూర్తి చేసెయ్యదల్చుకున్నారు. ఇంక రాగా సంవత్సరం నీగ్రోల్ని ప్రవేశపెట్టే బాధ వారికి తప్పుతుంది.

## సహాయంచేసే పద్ధతి కూడా తెలియని మొల్లె

### పశ్చిమ రాజ్యాలకు మోలే హెచ్చరిక

వాషింగ్టన్, ఏప్రిల్ 2: "విదేశాలకు సహాయం ఎట్లా చేయాలో కూడా పశ్చిమరాజ్యాలకు తెలియదు. ఇచ్చేది కొంచమయినా ప్రతిఫలం కోరకుండా ఇవ్వటం మంచిది. కాని ఎంత స్వల్పమయినా, ప్రతిఫలాన్ని కోరుతూ ఎంత ఎక్కువ సహాయం చేసినా రాణించదు. ఆర్థికరంగంలో తూర్పు, పశ్చిమరాజ్యాలకు ఇప్పుడు వచ్చిన పోటీలో రష్యన్లు తూర్పుఆసియానూ, పశ్చిమాసియానూ, చివరకు ఆఫ్రికా అంతటినీ ఉదారంగా సహాయం చేయటంద్వారా ఆకర్షిస్తారు." అని ఫ్రెంచి ప్రధాని హెచ్చరించారు.

మన పశ్చిమ రాజ్యాలు ఒకళ్ళతో ఒకళ్ళు పోటీలు పడుతూ వికాకిగా వ్యవహరిస్తూ ఉంటవి. ఇదే సాగుతూ ఉంటే మనం చివరకు ఓడిపోక తప్పదు" అని ప్రధాని శ్రీ మోలే నేడిక్కడ యునైటెడ్ స్టేట్స్ న్యూస్ అండ్ వరల్డ్ రిపోర్టు ప్రతినిధితో హెచ్చరిక చేశారు.

రష్యా ఆసియా దేశాలకు చేస్తున్న సహాయానికి ఆ ప్రజలు ఎంతో హర్షిస్తున్నారనీ, వారు పశ్చిమరాజ్యాలన్నిటినీ వలసవాదులుగా జమకట్టారనీ, తాము వారికి చేసిన సహాయాన్నికూడా పరిగణించకుండా అట్లాభావించారంటే కారణం తమకు సహాయంచేసే పద్ధతి తెలియకపోవటమే నని ఆయన అన్నారు.

పశ్చిమ రాజ్యాలు, ముఖ్యంగా అమెరికా, రష్యాపట్ల సవ్య విధానాన్ని అవలంబించటం లేదని ఆయన విమర్శించారు. అమెరికా, ఫ్రెంచి ప్రజలకే, ఒకరిని గురించి ఒకరికి సరిగా తెలియదనీ ఫ్రాన్స్‌లో అమెరికన్ అధికారుల ప్రవర్తన ప్రజలకు అమెరికాపట్ల అయిష్టత కలిగించిందనీ ఫ్రెంచి ప్రధాని ఆరోపించారు.

వెనకపడ్డ దేశాలకు సహాయం చేయటమన్నది స్వయంగా కాకుండా ఐక్యరాజ్య సమితి ద్వారా చేయాలని ఆయన సూచించారు.

### భారతదేశం వైఖరి

భారతదేశానికి అమెరికా సహాయం చేసేటప్పుడు ఏమయినా షరతులు పెట్టిందా అని ఆ విలేఖరి అడగ్గా, లేదని శ్రీ మోలే జవాబిచ్చారు.

"అయితే భారతదేశం ఎట్లా భావించిందీ మనం గమనించాలి. తనపట్ల మనం అవలంబిస్తున్న వైఖరినిపట్టి భారతదేశం మనల్ని గమనించటంలేదు. తన ఇరుగుపొరుగుల్లో ఉన్న చిన్న చిన్న దేశాలపట్ల మన విధానాలనుపట్టి మనపట్ల తన విధానాన్ని నిర్ణయించుకుంటుంది.

భారత నాయకుల్లో ఒకవిధమయిన ఉదారభావం ఉన్నది. దానివల్ల వారు తమ పరిసరప్రాంతాలన్నిటికీ తాము రక్షకులమని భావించుకుంటున్నారు. ఇప్పుడు వారు పశ్చిమాసియా, ఆఫ్రికాలకుకూడా రక్షకులమని భావించుకుంటున్నారు." అని ఫ్రెంచి ప్రధాని వివరించారు.

ఉత్తరాఫ్రికా విషయంలో భారత ప్రధానిదగ్గర కొన్ని హామీలను ఫ్రెంచి విదేశాంగ మంత్రి పినో సంపాదించారని మోలే తెలియజేశారు.

అల్జీరియాలో శాంతిని నెలకొల్పేందుకు సైనికచర్యలు అవసరమనీ, అతరవాత ఎన్నికలు జరిపి ప్రజాప్రతినిధులతో సంప్రదిస్తామనీ ఆయన ప్రకటించారు.

# అతివేగంగా పోయే 30 జెట్ బాంబర్లు

## బ్రిటన్‌లో భారతదేశ క్రయం

లండన్, ఏప్రిల్ 2: బ్రిటన్‌లో కాన్బెర్రా జెట్ బాంబర్లు సుమారు 30 విమానాలను కొనడానికి భారతదేశం ఏర్పాటు చేసిందని ఇక్కడి విమాన నిర్మాతలు చెప్తున్నారు. వీని ఖరీదు 52 లక్షల 40 వేల పౌనులు. ఒక్కొక్క విమానం ఖరీదు దాదాపు లక్షా 78 వేల పౌనులుంటుంది.

అయితే ఇందులో సుమారు సగం ధరకే సోవియట్ రష్యా విమానాలు అమ్మ చూపినప్పటికీ, భారతప్రభుత్వం అవి మానేసి, వేగంలో అన్నిటినీ మించిన ఈ బ్రిటిష్ జెట్ విమానాలను కొట్టింపుకొరలకు. ఎందుకు కొంటోందో బ్రిటిష్ అధికారులు ప్రశ్నించినా తెలపడంలేదు.

లండన్‌లో భారత రాయబారి శ్రీమతి విజయలక్ష్మి పండిట్ కూడా ఈ విషయమై ఎటువంటి వ్యాఖ్యానం చెయ్యడానికి నిరాకరించారు.



### నోటీసు

1956-57 సం॥నకు పశ్చిమగోదావరి జిల్లాబోర్డునకు కావలసిన స్టేషనరీ సామాన్లు సరఫరా చేయుటకు ది. ది. 17-4-1956 తేదిన మధ్యాహ్నము గం. 3 ల వరకు సీలువేయబడిన టెండర్లు తీసుకొనబడును.

టెండరు నిర్ణీతమైన ఫారముపైననే దాఖలు చేయవలెను. టెండరు ఫారములు సెట్టు 1 కి రూ. 2-0-0లు చొ॥న ఖరీదు చెల్లించి దరఖాస్తుపై ఏలూరు పశ్చిమగోదావరి జిల్లా బోర్డు ఆఫీసు నుండి పొందవచ్చును.

ఏలూరు 26-3-56 | సం. కె. సుబ్బరాజు, స్పెషల్ ఆఫీసరు, జిల్లాబోర్డు ఆఫీసు, పశ్చిమగోదావరి.

### టెండరు దాఖలుతేది పొడిగింపు

"దొనకొండలోని విమానము లాగు స్థలమునందు టర్మినల్ బిల్డింగు కట్టుటకు" 4-4-56 తేదీలోగా దాఖలు చేసికొన గోరుతూ పిలువబడిన టెండర్లు దాఖలు చేసికొనుటకు ఆఖరుతేదీ 11-4-56 వరకూ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, మద్రాసు ఏవియేషన్ డివిజన్ సి. పి. డబ్ల్యు. డి. మద్రాసు 10 వారిచే పొడిగింపబడినది. టెండర్లు 11-4-56న సా॥ 3 గంటల వరకు అంగీకరింపబడె...



### దక్షిణ రైల్వే టెండరు నోటీసు

### 3 మాసాల సీజన్ టిక్కెట్లు జారీ చేయుట

# మద్యం పార్సెళ్లు మాయం

## గోదావరి స్టేషన్లో

రాజమండ్రి, ఏప్రిలు 1: దక్షిణ రైల్వే ఈశాన్యభాగంలో విజయవాడ సేవను తర్వాత హెచ్చు ప్రయాణీకులూ-పార్సెల్సు రద్దీగలది గోదావరి సేషను. ఈస్టేషనులో స్థలాభావంచేత పార్సెళ్లు ప్లాటుఫారంమీదనే ప్రయాణీకుల కాళ్లకు తగులుతూ అడ్డుగా పడివుంటాయి.

మార్చి నెలలో మూడవ వారంలో మద్యపానీయపు సీసాలుగల పార్సెళ్లు కొన్ని ఇక్కడికివచ్చి నిల్వవుండగా మరి రెండురోజులకు చూస్తే ఆ పార్సెలు గైర్ వలియా అయింది!

అసంఖ్యాకంగా ప్లాటు ఫారంపై నిల్వవున్న పార్సెళ్లనుచూచి, మావిలేఖరి ఈరోజు ఉదయం ఒక రైల్వే ఉద్యోగితో "ప్రయాణీకు లెవరైనా యిందులో ఒకపార్సెలు రైలులో పెట్టుకు తీసుకుపోతే మీకొచూకీ ఎట్లా తెలుస్తుంది?" అని ప్రశ్నించిన పిమ్మట పైసమాచారం తెలిసింది. (స్వ. వి.)

### గోదావరి నౌకాకార్మికులకు బోనస్

రాజమండ్రి, ఏప్రిలు 1: రాజమండ్రిలో గోదావరినదిలో తిరిగే వ్యాపార నౌకల (మోటారు లాంచీల) కార్మికులసంఘం రెండునెలల వేతనం తమకు బోనసుగా ఇప్పించాలని, కొంతకాలం నుంచీ నౌకల యజమానుల సంఘాన్ని కోరుతూవున్నారు. కొన్నిరోజులుగా ఈ ఉభయసంఘాల మధ్యనూ జరిగిన సంప్రతింపుల ఫలితంగా, నౌకా యజమానులసంఘం కార్మికులకు 15 రోజుల జీతం బోనసుగా ఇచ్చారని, కార్మిక సంఘ కార్యదర్శి శ్రీ ఎ. వి. రమణయ్య మావిలేఖరికి తెల్పారు.

### కాంబోడియాకు నెహ్రూ సానుభూతి

### సేద్యంలో ఆధునిక శాస్త్ర పద్ధతులు

#### అమలు జరపాలని రాష్ట్రపతి విజ్ఞప్తి

### రైలు త్వరగా రాకపోతే సత్యాగ్రహం

### రాజమండ్రి కాస్మాపాలిటన్ క్లబ్బు పోటీలు

# ఆయుధాల తగ్గింపు పథకం

## రష్యా పథకానికి పశ్చిమ రాజ్యాల వైముఖ్యం

లండన్, ఏప్రిల్ 2: ఆయుధాల తగ్గింపుపై సోవియట్ యూనియన్ ప్రతిపాదించిన కొత్త పథకాన్ని పశ్చిమరాజ్యాలు నిరాకరించ నిశ్చయించినట్లు తెలుస్తున్నది. రేపు ఇక్కడ సమితి ఆయుధాల తగ్గింపు ఉపసంఘ సమావేశంలో అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సుల ప్రతినిధులు సోవియట్ ప్రతినిధికి ఈవిషయాన్ని తెలియజేస్తారని తెలుస్తున్నది.

సోవియట్ పథకం కిందటివారమే సమితి ఉపసంఘంలో ప్రతిపాదించారు. అగ్రరాజ్యాల సాధారణ బలాలను మొదట తగ్గించాలని అది ప్రతిపాదిస్తున్నది. ఈపథకంలో అణ్వస్త్రాల పోటీని ఆపేందుకు ప్రతిపాదన ఏమీ లేనందువల్ల అది తమకు ఆశాభంగం కలిగించినట్లు బ్రిటిష్, ఫ్రెంచి ప్రతినిధులు సోవియట్ ప్రతినిధి గ్రోమికోకి తెలియజేస్తారట.

ప్రెసిడెంట్ ఐసెన్ హోవర్ ప్రతిపాదించిన విమాన పరిశీలన పథకానికి రష్యా పథకంలో ప్రాధాన్యత లేనందువల్ల తాము నిరాకరిస్తున్నట్లు అమెరికా ప్రతినిధి స్టాసెన్ చెప్తారట. అంతర్జాతీయంగా పరస్పర విశ్వాసం కుదిరేవరకూ అణ్వస్త్ర నిషేధానికి అమెరికా అంగీకరించేందనీ, ఆయుధాల తగ్గింపుకు ఒక ప్రారంభ ప్రణాళికను పరీక్షించటంవల్ల పరస్పర విశ్వాసం కుదురుతుందనీ అమెరికా భావిస్తున్నది. రష్యన్ పథకం అమెరికా, రష్యా, చైనాల సాయుధబలాలను 10, 15 లక్షలకూ, బ్రిటన్, ఫ్రాన్సుల బలాలను 6½ లక్షలకూ పరిమితి పరచాలని సూచిస్తున్నది. తన సాయుధబలాలను 25 లక్షలకు తగ్గించేందుకు మాత్రం అమె...

### అమెరికా కార్మిక నాయకుని భారత యాత్ర

### పిట్స్‌బర్గ్ విమాన ప్రమాదంలో 30 మంది మృతి

### కావలెను

### దేవునికి పోలీసు సహాయం

#### మహబూబాబాద్‌లో ఒకవ్యక్తి అల్లరి

మహబూబాబాద్, ఏప్రిల్ 1: ఒక వ్యక్తి దౌర్జన్యం జరిపిన కారణంగా శ్రీ వేణుగోపాలస్వామి ఊరేగింపు మానిపోలీసుల సహాయంలో ఆలయం చేరుకోవలసివచ్చింది.

ఐదురోజుల ఉత్సవాల సందర్భంలో మార్చి 27న శ్రీ వేణుగోపాలస్వామి తిరునాళ్లు, రథోత్సవం ఏర్పాటు చేశారు.

ఉత్సవంలో పాతబజారు రజకవాడ దగ్గరకు రథం రాగానే ఒక వ్యక్తి దేవునిపై ఆగ్రహించి, మంగళహారతులు దెచ్చినవారి పళ్లెంలు పడవేసి, నానా అల్లరి చేశాడట. అంతట అర్చకులు రథం వదలిపెట్టి ఆలయ ధర్మకర్తలకు చెప్పగా, వారు పోలీసుల సహాయాన్ని అర్థించారు. పోలీసులువచ్చి, దేవుడిని సురక్షితంగా ఆలయం చేర్చారు. దర్యాప్తు జరుగుతున్నది.

### గార్ల గ్రామంలో అస్పృశ్యతా నివారణ సభ

మహబూబాబాద్, మార్చి 31: గార్ల గ్రామములో, అస్పృశ్యతా నిర్మూలన ప్రచార సభ జరిగింది. ఫిర్కాలోని హరిజనులు, సవర్ణులు, కూడా చాలా మంది పాల్గొన్నారు...

### మెలుపల్లెగ్రామస్థులచే రోడ్డు నిర్మాణం

### మంత్రి శ్రీ ఓబులరెడ్డికి గుంటూరు పౌరుల విందు

### రాజంపేట తాలూకాలో భూదానం

### ప్రఖ్యాత గాయకుని మృతి

# క్రీడారంగం

## ప్రపంచ టేబుల్ టెన్నిస్ పోటీలు

### టీం పోటీలలో ఇండియా వెనుకంజ

టోక్యో, ఏప్రిల్ 3: నిన్న ఇక్కడ ప్రపంచ టేబుల్ టెన్నిస్ చాంపియన్‌షిప్ పోటీలు ప్రారంభమయినవి. అంతర్జాతీ టీమ్ చాంపియన్‌షిప్ పోటీలలో ఇండియా ప్రతినిధులు వెనుకంజవేశారు. స్వెత్లింగ్ కప్ (పురుషుల టీం చాంపియన్‌షిప్) పోటీలో నిన్న భారతజట్టు ఇంగ్లండ్, జెకోస్లవేకియాలచేతిలో ఓడిపోయింది. కార్బిలాన్ కప్ (స్త్రీల టీం చాంపియన్‌షిప్.) పోటీలలో నిన్న ఇండియాను రుమేనియా, నవచైనాలూ, ఈ పేళ జపాను ఓడించినవి.

స్వెత్లింగ్ కప్—ఇంగ్లండ్ ఇండియాను 3 పోటీల తేడాతో ఓడించింది (5-3). బెర్గ్‌మన్ షా తీసవ్యాస్‌నీ (21-12, 21-14), ఫాకర్ట్ బెర్గ్‌మన్‌నీ (22-20, 21-17), లీచ్ ఫాకర్ట్‌నీ (26-24, 21-18), లీచ్ వ్యాస్‌నీ (19-21, 21-18, 21-12), నాగరాజ్ లీచ్‌నీ (21-11, 22-20), కెన్నడీ వ్యాస్‌నీ (21-23, 21-12, 21-10) కెన్నడీ నాగరాజ్‌నీ (17-21, 24-22, 21-5) ఓడించారు.

జెకోస్లవేకియా ఇండియాను ఓడించింది. (5-0) వియోమనోవస్కీ ఫాకర్ట్‌నీ (21-9, 21-14), వ్యాస్‌నీ (21-17, 21-17) ఓడించాడు. స్టిపెక్ వ్యాస్‌నీ (21-18, 21-13), ఆంద్రియాడీస్ నాగరాజ్‌నీ (21-9, 21-11), ఫాకర్ట్‌నీ 21-7, 12-21, 21-19) ఓడించారు.

స్వెత్లింగ్‌కప్. ప్రస్తుత చాంపియన్ అయిన జపాన్ జట్టు సింగపూర్‌నీ (5-0), దక్షిణ కొరియా చైనానూ (5-1), జపాన్ ఫిలిప్పీన్స్‌నీ (5-0), హాంకాంగ్ సింగపూర్‌నీ (5-2), రుమేనియా ఫిలిప్పీన్స్‌నీ (5-0),...

...ప్రస్తుత చాంపియన్ అయిన రుమేనియా ఇండియాను ఓడించింది (3-0). ఎల్లా జెల్లర్ మీనాపరంజేనీ (21-12, 21-14), రోజియానూ శాజెల్‌జన్‌నీ (21-10, 21-16), జెల్లర్, రోజియసులు పరంజే, జాన్‌లనీ (21-4, 21-6) ఓడించారు.

జపాన్ అమెరికానీ (3-0), ఇంగ్లండ్ దక్షిణకొరియానీ (3-2), ఇంగ్లండ్ హాంకాంగ్‌నీ (3-0) ఓడించి...

# భారతదేశానికి అమెరికా సహాయం

### శ్రీ కూపర్‌కు పిలుపు

వాషింగ్టన్, ఏప్రిల్ 2: భారతదేశానికి అర్థికసహాయం చేయాలని అమెరికా ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలకు ప్రచారంచేసే నిమిత్తం ప్రస్తుతం ఢిల్లీలో రాయబారిగా ఉన్న శ్రీ షెర్మన్ కూపర్‌ని పిలిపించేందుకు ప్రభుత్వం నిశ్చయించినట్లు తెలుస్తున్నది. కూపర్ ఏప్రిల్ 10వ తేదీన ఇక్కడికి వచ్చి మూడు నెలలు ఉంటారట.

అమెరికా ప్రభుత్వం వచ్చేఏడు 7 కోట్ల డాలర్ల సహాయం భారతదేశానికి చేయాలని కోరుకున్నది. వచ్చే అయిదేళ్లలో, భారతదేశ ద్వితీయ పంచవర్ష ప్రణాళికకు 45 లేక 50 కోట్ల డాలర్ల సహాయానికి అమెరికా హామీ ఇవ్వాలని కూపర్ ఒత్తిడి చేస్తున్నారట.

కౌలాలంపూర్, ఏప్రిల్ 2: మలయాలో కమ్యూనిస్టులపై మరింత తీవ్ర చర్యలు తీసుకోడానికి అత్యవసర చర్యల సంఘాన్ని ప్రధాన మంత్రి తేంగ్‌కూ అబ్దుల్ రహ్మాన్ సమావేశపరుస్తున్నారు.

మలయా ప్రధాని కమ్యూనిస్టుల శాంతి సమాలోచనల సూచనను నిరాకరించారు. సింగపూర్ ప్రధానికూడా నిరాకరించడం కంటె మరో మార్గం లేదన్నారు.

### రన్‌జీట్రోఫీ ఫైనల్సులో బొంబాయి గెలుపు

కలకత్తా, ఏప్రిలు 2: బొంబాయి, బెంగాల్‌లమధ్య జరుగుతున్న రన్‌జీ ట్రోఫీ క్రికెట్ టూర్నమెంటు అఖిల భారత ఫైనల్సులో నాలుగోరోజయిన ఈ పేళ బొంబాయి 8 వికెట్ల తేడాతో బెంగాల్‌ని ఓడించింది.

మొదటిఇన్నింగ్సు-బెంగాల్ 255...

### మద్రాసు రాష్ట్రంలో మరి రెండు వ్యాయామ కళాశాలలు

...వ్యాయామ కళాశాలలు ఏర్పాటు కాబోతున్నవని విద్యా మంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యం నేటి సాయంత్రం సైదాపేట వై. ఎం. సి. ఏ వ్యాయామ కళాశాలలో క్రీడా వేదికకు ప్రారంభోత్సవం జరుపుతూ శ్రీసుబ్రహ్మణ్యం ఈ విషయం తెలియజేశారు.

కొత్తవ్యాయామ కళాశాలల్లో ఒకటి, కోయంబత్తూరు దగ్గర ఉన్న పెరియనాయకన్ పాలయంలోనూ, రెండోది కారైకుడిలోనూ ఏర్పడుతవి.

# తాడేపల్లిగూడెంలో ధాన్యం ధర పడేసూచన

## కొనుగోలుపన్ను విధిస్తారని కొనుగోళ్ల తగ్గింపు

తాడేపల్లిగూడెం, ఏప్రిల్ 1: ధాన్యం, బియ్యంమీదకొనుగోలుపన్ను రూపాయికి ఆరు పైసలు విధించాలని ఆంధ్రప్రభుత్వం నిశ్చయించినందువల్ల మిల్లు యజమానులు – టోకు వ్యాపారస్థులు బస్తాకు పన్నెండు అణాలు చెల్లించవలసివస్తుంది. స్థానిక వ్యాపారస్థులు కొత్తగా సరుకుకొనడానికి వైముఖ్యం చూపుతున్నారు. ధాన్యం ధర బస్తాకు ఒక రూపాయి తగ్గిపోవచ్చునని అనుకుంటున్నారు. గతవారంనుంచి కొచ్చిన్ వ్యాపారస్థులు, ఉప్పుడు బియ్యం - పచ్చిబియ్యం కొనడంలేదు. బర్మానుంచి ఒక ఓడ పచ్చిబియ్యం రావచ్చునని అంటున్నారు.

ఈవారం ధరలు: పచ్చి బియ్యం – ఉప్పుడు బియ్యం ఎగుమతి ధరలు ఈ విధంగా ఉన్నవి:

పచ్చిబియ్యం: సంచితోసహా 164 పౌన్లు బస్తా

| | |
|---|---|
| అక్కుళ్లు | 33-8-0 |
| బసంగి | 31-8-0 |
| కృష్ణకాటుకలు | 36-8-0 |
| సన్నకృష్ణకాటుకలు | 37-8-0 |
| కిచిలీసాంబాలు | 38-0-0 |
| బంగారుతీగలు | 41-0-0, 46-0-0 |

ఉప్పుడు బియ్యం:

| | |
|---|---|
| అక్కుళ్లు | 32-12-0 |
| బసంగి | 30-0-0, 31-12-0 |

స్థానిక ధరలు

| | | |
|---|---|---|
| వేరుశెనగ | 96 పౌన్లు | 18-8-0 |
| ,, నూనె 24 | ,, | 16-4-0 |
| ,, పిండి (ఎక్సు పెల్లర్) | 166 పౌన్లు | 14-8-0 |

| | |
|---|---|
| స్థానికంగా ధరలు: ధాన్యం: 166 పౌన్లు | |
| అక్కుళ్లు | 21-0-0 |
| కృష్ణకాటుకలు | 28-0-0 |

## బొంబాయి మార్కెట్

బొంబాయి, ఏప్రిల్ 3:

| | |
|---|---|
| వెండి (100 తు.) | 180-9-0 |
| బంగారం తులం 1 కి | 104-14-0 |
| సవరను | 66-2-0 |
| వేరుశెనగ విత్తులు | 84-14-0 |
| అవిశె విత్తులు | 34-8-0 |
| అవిశె నూనె | 21-6-0 |
| ఆముదం విత్తులు | 27-4-0 |
| వేరుశెనగ నూనె మణుగు | 19-0-0 |
| నైగర్ విత్తులు | 29-8-0 |

## న్యూయార్కు దూది

### జూన్ వాయిదా ధరలు

న్యూయార్కు, ఏప్రిల్ 2: న్యూయార్కు కాటన్ మార్కెట్ ధరలు నేడీ విధంగా ఉన్నవి:

| | |
|---|---|
| నేటి ప్రారంభ ధర | 33.47 |
| నేటి ముగింపు ధర | 33.58 |

# ఆకాశవాణి

గురువారం, ఏప్రిల్ 5

### విజయవాడ

ఉ॥ 6-50 స్వాగతం 6-55 ప్రసార విశేషాలు 7 తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) వలె 7-30 మద్రాసు వలెకే ఆంగ్లమున వార్తలు.

మ॥ 12 (బి) వలె 1-40 హిందీలో వా॥ 1-50 తెలుగున వా॥ 2 (బి) వలె 2.15 హిందీలో కార్యక్రమం.

సా॥ 5-30 చదలవాడ సుబ్బయ్య వయొలిన్ 5-45 సంగీత శిక్షణ 6 స్థానిక ప్రకటనలు 6-5 ప్రాంతీయ వా॥ 6-15 గ్రామ॥ కార్యక్రమం 7 తెలుగున వా॥ 7-15 గీతావళి ఐ. ఇందిర 7-30 భూసంస్కరణలు జమీందారీ రద్దు (ప్రసంగం) ప్రా॥ మామిడిపూడి వెంకటరంగయ్య 7-45 శ్రీకృష్ణ జననం హరికథా కాలక్షేపం సి. హెచ్. ఎల్. నరసింహాచార్యులు 8-30 ఎ. ఐ. ఆర్. వాద్యబృందం 8-45 గానసుధ (బి) 9 ఆంగ్లమున వా॥ 9-15 గీతావళి ఐ. ఇందిర 9-30 చదలవాడ సుబ్బయ్య వయొలిన్ 10 ప్రసార సమాప్తి.

### మద్రాసు (ఎ)

ఉ॥ 6-50 స్వాగతం 6-55 కార్యక్రమ వివరణ 7 వాద్య సమ్మేళనం 7-15 తమిళ వా 7-30 ఆర్. ఎస్. మణి

మ॥ 12-30 టి. రంగమ్మాళ్ —వీణ 1 మహిళామండలి తెలుగు సమాజము – నాడూ, నేడూ : కులవ్యవస్థలు (ప్రసంగం) వాఙ్మయ పరిచయం : ధమ్మపద్ (ప్రసంగం) 1-30 (బి) 1.40 హిందీ వా 1-50 (బి) 2 తమిళ వా 2-10 సాకేత్ సా—వ్యాఖ్యాసహిత కావ్య పఠనము—బి. వి. కాశీరామ్ శాస్త్రి 2-25 తమిళ ప్రసంగం 2-40 విరామ సంగీతం 2-50 బి. కులోత్తన.

సా॥ 5 పాశ్చాత్య సంగీతం (బి) 5-30 బి. కృష్ణస్వామి—నాదస్వరం 6-05 ప్రాంతీయ వా 6-15 ఎస్. ఆర్. జానకిరామన్ 6-45 కె. ఎం. లక్ష్మి, జె. రుక్మిణి 7-15 తమిళ వా 7-30 నీతి కథ (బి) సి. రాజగోపాలాచారి 7-35 క్లారినెట్ 7-45 బి వలె 9 లలిత గీతాలు 9-15 తిరుచిరాపల్లి... చిత్తూర్ సుబ్రహ్మణ్యపిళ్లై. బి. కె. విశ్వనాథశర్మ-వయొలిన్ సి. కె. శ్యామసుందర్ -మృదంగం 9 ఆంగ్ల వా 9-15 హరిజన్ గోపురం (ఆంగ్ల కథానిక) హిల్టన్ బ్రౌన్ 9-30 కోటీశ్వర అయ్యర్ మేళరాగ కీర్తనలు 9-45 తిరుచిరాపల్లి 10 శ్రోతలు కోరిన పాటలు (బి) 10-30 ప్రసార సమాప్తి

### హైదరాబాద్

ఉ॥ 6-50 సుప్రభాత్ 6-55 కార్యక్రమ వివరణ 7 తెలుగువా. 7-15 శాస్త్రీయ రాగభూషణం వయొలిన్ 7-45 కన్నడవా. 8 ఆంగ్లవా. 8-15 హిందీవా. 8-30 ఖయాల్.

మ॥ 12-30 (బి) 12-50 మరాఠీవా. 1 స్త్రీ సంసార్ 1-45 తేలుగు (బి) 1-50 తెలుగువా.

సా॥ 5-30 ఖయాల్ 6 భజన్‌గీత్ 6-15 సితార్ 6-30 ఎం. ఎస్. రామారావు (బి) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గ్రామసీమ 7 తెలుగువా. 7-15 గ్రామసీమ 7-30 భూసంస్కరణలు (ప్రసంగం) మద్రాసునుండి బిలె 7-45 గీత్ 8 హిందీ ప్రసంగం 8-15 సితార్ 8-30 ప్రసార్ గీత్ (ఢిల్లీ) 9 ఆంగ్లవా. 9-15 ఉర్దూవా. 9-30 శాస్త్రీయ రాగభూషణం -వయొలిన్ 10-30 ప్రసార సమాప్తి.

# మదరాసు ధరలు

మదరాసు, ఏప్రిల్ 3:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డు బొమ్మ

| | |
|---|---|
| సీల్సుటాక్సుతో సహా | రు. 67-0-0 |
| పెట్టిబంగారం తులం | రు. 106-8-0 |
| మూస బంగారు | రు. 104-12-0 |
| సీమవెండి తులం100కి రెడి | రు. 183-8-0 |
| చిల్లర ధర | రు. 1-14-0 |

### వేరుశెనగ

(581 పౌ॥ 1-కి ఎక్సుకోస్తా గిడ్డంగులు మిషిన్ సేల్సుటాక్సుతో సహా

| | |
|---|---|
| డిసెంబరు | రు. 152-158 |
| వేరుశెనగనూనె ఎక్సుపెల్లర్ మిల్లో 5% (500పౌ.) రెడిచిల్లరధర | 314-0-0 |

కొంకాయనూనె (37½ పౌనులు సేల్సుటాక్సు అదనం

| | |
|---|---|
| అంబుమార్కు | రు. 26-4-9 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | 26-12-9 |
| రాజా | రు. 26-0-9 |

### ఆముదం

| | |
|---|---|
| తిరుపత్తూరు (500 పౌ.) | రు. 270-0-0 |

(2 నాంది)

బ్రిటిష్, రిఫైన్డ్ షుగర్ 85-12-9

రూ 1 కి 0-1-3 ప్రత్యేక సేలుటాక్సు

ఉత్తర ప్రదేశ్ లోని ఇజత్ నగర్ పశువైద్య పరిశోధన కేంద్రంలో ఒక దృశ్యం. దాదాపు వెయ్యి ఎకరాల విస్తీర్ణంగల ఆవరణంలో వివిధ పరిశోధనలను సాగిస్తున్న ఈ కేంద్రం అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించింది.

## పత్రికా ప్రతినిధుల నవభారత సందర్శన యాత్ర

# ఇజత్ నగర్ పశువైద్య పరిశోధనా కేంద్రం

## దాని అంతర్జాతీయ ఖ్యాతి: గత నూరేళ్లలో జరిగిన కృషి సమీక్ష

ఉత్తర ప్రదేశ్ లో బరెల్లీ పట్టణానికి సమీపంలో వున్న ఇజత్ నగర్ పశువైద్య పరిశోధనా కేంద్రం ఈనాడు అంతర్జాతీయ ఖ్యాతి నార్జించుకున్నది. ఇది భారత ప్రభుత్వ యాజమాన్యాన నడుస్తున్న సంస్థ. ఆసియాఖండం మొత్తంమీద ఇలాంటి సంస్థ మరొకటి లేదు. ప్రపంచంలో దీనిది మూడోస్థానం. పరిశోధనలు సాగించడమే గాకుండా ఇది పశువైద్య శాస్త్రంలో విద్యార్థులకు ఉన్నత శిక్షణ కూడా ఇస్తున్నది. బర్మా, మలయా, సింహళం, సయాం, చైనాల నుంచి వచ్చిన పలువురు విదేశీయులు కూడా ఇక్కడ విద్యాభ్యాసం చేస్తున్నారు. ఇక్కడ తయారయే ఔషధాలను ఇరాక్, ఇరాన్, ఆఫ్ఘనిస్థాన్, ఈజిప్టు మొదలైన అనేక దేశాలకు పంపుతున్నారు. ఇది 70 ఏళ్ళ నుంచీ పనిచేస్తున్న పరిశోధన కేంద్రం. దీని చరిత్రను, గత నూరేళ్ళలో భారతదేశంలో జరిగిన పశువైద్య పరిశోధనల చరిత్రను ఈవ్యాసం సమీక్షిస్తున్నారు.

**పి. శ్రీరాములు.**

"క్రోడి పుంజు నెత్తిమీది
కొద్ది జుట్టు చూడరా!
ఆడకోడి గుడ్లు పెట్టు
అందు పిల్ల లగునురా!"

అన్నాడు ఓకొత్తిమిరి కవి!

ఇది చిన్నప్పుడు ఏ పాఠ్య పుస్తకంలోనో చదువుకున్నట్లు గుర్తు. చదువుకున్నా, చదువుకోకపోయినా అందరూ అనుదినం ప్రత్యక్షంగా చూస్తున్న విషయమే.

ఎర్రగా ధగాధగా మెరిసిపోతూ బహు అందంగా అటుఇటూ ఊగాడుతూవుండే అజుట్టు ఒక్క పుంజు నెత్తిమీదే ఎందుకుండాలి? పెట్టకు కూడా వుండ కూడదా? పైగా, ఆడకోడి మాత్రమే ఎందుకు గుడ్లు పెట్టాలి? పుంజు ఎందుకు పెట్టకూడదు?

పనకటికి, మాకోక మాస్టరు గారు వుండేవాడు. చిక్కు ప్రశ్నలు, చిరాకు సమస్యలు వేసి కుర్రవాళ్లను తికమక పెట్టడమంటే ఆయనకు పెద్ద సరదా. ఒకరోజు క్లాసుకు వచ్చిరావడంతోనే "అరే, అబ్బాయిలూ! వెంకన్న పుంజు రామన్న పెరటిలో నాలుగు గుడ్లు పెట్టింది. ఎవరివిరా, ఆ గుడ్లు?" అని ఇంగ్లీషులో ప్రశ్నించాడు.

"వెంకన్న వేనండీ," అన్నాడు ఒకడు.

"కాదు, రామన్న వే నండీ," అన్నాడు మరొకడు.

"ఎవరివీ కాదు, పుంజువే,"అన్నాడు మూడోవాడు, అతి తెలివిగా. పుంజేమిటి? గుడ్లు పెట్టడమేమిటి? అన్న ఆలోచన ఎవరికీ తోచనేలేదు. ఎద్దు ఈనిందీ అంటే, గాటకట్టెయ్యమన్న ధోరణిలో జవాబులు చెప్పారు.

అయితే ఒక విషయం మరిచిపోకూడదు. ఇది శాస్త్రం యుగం. అందులో పరమాణుశక్తిని మానవుడు స్వప్రయోజనాలకోసం కరతలామలకం చేసుకుంటున్న మహాయుగం. ఈనాడు కేవలం చోప్పదంటు సందేహాలుగా కనబడుతున్న అనేక విషయాలు ముందు ముందు వాస్తవిక విషయాలుగా పరిణమించవచ్చు. ముందు ముందు ఏ అద్భుత పరిశోధనల ఫలితంగానైనా కోడిపుంజుకూడా గుడ్లు పెట్టడం సంభవిస్తుందేమో ఎవరు చెప్పగలరు? కాలగర్భంలో దాగివున్న ఎన్నెన్ని మహత్తర రహస్యాలను భావిశాస్త్రకారుడు బయటపెట్టబోతున్నాడో ఎవరు ఊహించగలరు? ఈ పుణ్యభూమిలో తిరిగి పాతకాలపు కామధేనువులు,కల్పవృక్షాలూ వెలుస్తాయేమో ఎవరికి తెలుసు?

* * *

గొడ్డుబోతు ఆవులను, గేదలను పాడి ఆవులుగా, పాడి గేదలుగా మార్చవచ్చా?

లేగలను పెటాలంటే ఆవును, ఆంబోతును ఒకచోట విధిగా చేర్చవలసిందేనా? విడివిడిగానే వుంచి ఆవు లేగలను ఈనేట్లు చేయలేమా?

అరకకు ఎద్దులనే ఎందుకు కట్టాలి? ఆవులను కడితే దున్నలేవా? కడితే ఏమవుతుంది? వాటిలో ఏదైనా మార్పు వస్తుందా?

ఒక కోడిపెట్ట సహజంగా సాలుకు ఎన్ని గుడ్లు పెడుతుంది? మంచి కోడి అయితే ఎన్ని గుడ్లు పెట్టాలి?

డాక్టర్ లింగార్డ్

ప్రముఖ ఆంగ్లేయుడు: 17 ఏళ్లు పని చేసి కేంద్రం అభివృద్ధికి అమోఘమైన కృషి చేశాడు.

మామూలుగా ఒక పశువు రోజుకు ఎన్ని పాలు ఇస్తుంది? ఎన్ని పాలు ఇస్తే దాన్ని ఉత్తమజాతి పశువుగా పరిగణిస్తాము?

శాఖోపశాఖలుగా సాగుతున్న ఆధునిక వైద్యశాస్త్రపరిశోధనలు ఈప్రశ్నలన్నిటికీ కొంతవరకు స్పష్టమైన సమాధానాలనే ఇవ్వగలుగుతున్నవి. ఈ పరిశోధనల ఫలితాలను మానవుడు ప్రత్యక్షంగామాని అనుభవించగలుగుతున్నాడు.

* * *

పాడిపంటలు సమృద్ధిగా వున్నప్పుడే ఏ దేశమైనా సిరిసంపదలతో తులతూగుతున్నదని అంటాము. భారతీయుల దృష్టిలో పాడీ, పంటా లేని కొంప పాడుకొంప! అలాగే దేశంకూడా.

మనది వ్యవసాయమే ప్రధానవృత్తిగా గల దేశం. వ్యవసాయానికి పశుగణం వెన్నెముకలాంటిది. అందుచేత పశుగణాన్ని దేశఐశ్వర్యంగానే భావించవలసి వుంటుంది.

భారత ప్రజలకు వేదకాలంనుంచీ కూడా గోవు తల్లితోసమానం. అందుచేతే, దాన్ని అతి ఆప్యాయంగా 'గోమాత' అని పిలుచుకుంటాము. దాని అమూల్యమైన విలువను చెప్పవలసివచ్చినప్పుడు 'గోవు మాణిక్యం' అనికూడా అంటాము. గోమాత చల్లగావుంటేనే, ఇంటిల్లిపాది కడుపూ చల్లగా వుంటేది.

మన దేశంలో వున్నంత గృహోపయోగ పశుసంతతి, పక్షిసంతతి ప్రపంచం మొత్తంమీద మరే దేశంలోనూ లేదు. దురదృష్టమనండి, అదృష్టమనండి తోళ్ళ పరిశ్రమలోకూడా మనదేశానిదే అగ్రస్థానం. అంటే, పశువుల సంఖ్యాబలం ఎక్కువైనట్లే, వాటి చావుల సంఖ్యకూడా అపరిమితమే నన్నమాట. సహజ కారణాలవల్ల మరణిస్తే, విచారపడవలసిందేమీ వుండకపోవచ్చు. ఏ అంటు వ్యాధో విపరీతంగా ప్రబలడం, అమూల్యమైన మన పశుసంపద మందలు మందలుగా, వున్నవి వున్నట్లే, మరణించడం తరుచూ అనేకచోట్ల సంభవిస్తున్నది. ఈ విధంగా పశుసంపద క్రమక్రమంగా అభివృద్ధి కావడానికి బదులు అకాల ఆకస్మిక మరణాలవల్ల కొంతవరకు క్షీణించి పోతున్నది. కాని పశువైద్య పరిశోధనలో ఇటీవల సాధించిన విజయాల ఫలితంగా ప్రస్తుతం పరిస్థితులు క్రమక్రమంగా బాగుపడుతున్నవి.

* * *

భారతదేశంలో దాదాపు 16 కోట్ల వరకూ రకరకాల పశుసంపదా వున్నది. వీటిలో 50 లక్షల వరకూ గేదలు, ఆవులు, దున్నలు, ఎద్దు. ఇవిగాక, దాదాపు 4 కోట్ల గొర్రెలు, 5 కోట్ల మేకలు, 80 లక్షలవరకూ గుర్రాలు, గాడిదలు మొదలయిన ఇతర జంతువులు ఉన్నవి. కోటాను కోట్లగా ఉన్న కోళ్లు, బాతులు మొదలయిన పక్షిసంతతి సంగతి సరేసరి. ఇంత పశుపక్షిసంతతి మరేదేశానికీ లేదు. కుటుంబాలను పట్టి లెక్కకడితే, ప్రతి కుటుంబానికి సగటున మనదేశంలో వచ్చినన్ని పశువులు మరే దేశములోనూ రావు.

పశుపక్షి సంతతి ద్వారా దేశ ఆర్థిక వ్యవస్థకు సాలీనా 4000 కోట్ల రూపాయల వరకూ ఆదాయం లభ్యమవుతున్నదంటే, పశుగణ పోషణ విషయంలో మనం ఎంత శ్రద్ధాసక్తులు చూపడము అవసరమో బోధపడుతుంది. వ్యవసాయంలో పొందుతున్న సహాయం ద్వారానూ, పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, ఉన్ని, గుడ్లు, మాంసం మొదలయిన వాటి అమ్మకం ద్వారానూ ఇంత రాబడి మన జాతీయాదాయానికి జమ అవుతున్న దన్నమాట. రైళ్ల ద్వారానూ, పడవల ద్వారానూ, ఇతరవిధంగానూ దేశంలో దాదాపు 10 లక్షల మణుగుల వరకూ నెయ్యి వివిధ రాష్ట్రాలమధ్య సాలీనా రవాణా అవుతున్నది. దాదాపు 20 లక్షలబరువుగల పచ్చితోళ్లూ, 6 లక్షల మణుగుల వరకూ పదును చేసిన తోళ్లూ ఒక రాష్ట్రంనుంచి మరొక రాష్ట్రానికి రవాణా అవుతున్నవి. ఇంత బ్రహ్మాండమైన వ్యాపారానికి కారణభూతమైన పశుసంపదను పరిరక్షించు కోవడము భారతజాతి ప్రధాన కర్తవ్యమనడంలో ఆశ్చర్య మేమున్నది?

* * *

గేదలు, అవులు, మేకలు మొదలైన పశుసంతతిని, ఇతర దేశాలతో పోల్చి చూస్తే, ఇవ్వవలసిన్ని పాలు, వెన్న ఇవ్వడం లేదు. వీటిలో కొన్ని గొడ్డుబోతు గొడ్లు. వీటనికూడా మనవాళ్లు ఉపయోగించక పోవడం లేదు గాని, మొత్తంమీద వీటివల్ల ఉపయోగము తక్కువేనని చెప్పాలి.

అయితే సవ్యమైన పరిస్థితులను సక్రమమైన ఆహారపోషణను, అనుకూలమైన వాతావరణ పరిస్థితులను కల్పిస్తే, మన ఆవులు, గేదలు ఇతర దేశాల వాటికి ఏవిధంగానూ తీసిపోవని పరిశీలనవల్ల తేలింది. అందుచేత మన పశుసంతతి శక్తిసామర్థ్యాలు స్వల్పమైనవని చెప్పడం సాహసమే అవుతుంది.

ఉత్తమ తరగతికి చెందిన ఆంబోతుల కొరత మనదేశంలో బహు జాస్తిగా వున్నది. అవసరాలు పూర్తిగా తీరాలంటే, కనీసం 250 ఆంబోతులకు ఒక్కటి కూడా లేని పరిస్థితి, ఒక్కొక్క ఆంబోతుకు ... వస్తున్నది. ఉత్తమజాతికి చెందిన ఆంబోతుల కొరత ఎప్పుడైతే ఏర్పడుతుందో, అప్పుడే బలహీనమైన, నిరుపయోగమైన గోసంతతి తయారవుతుంది. తద్వారా పశుసంపద క్షీణిస్తుంది. అంటువ్యాధుల ప్రాబల్యంచేత, మనదేశంలో సాలీనా అన్నిరకాలవీ దాదాపు 4 లక్షల పశువులు మరణిస్తున్నవి. ఈ కారణాలన్నిటివల్లా, పశువ్యాధులను నిర్మూలించడం, ఉత్తమజాతి పశుసంపదను అభివృద్ధిచేసుకోవడం భారత జాతికి ఒక ప్రధాన సమస్యగానే ఏర్పడ్డది.

* * *

భారతదేశ సహజసంపదగావున్న ఈ అపారమైన పశుగణాన్ని మనం జాగ్రతగా, శ్రద్ధగా పోషిస్తే, ఇబ్బడి ముబ్బడిగా ప్రతిఫలాన్ని ఇచ్చి మనిలను పోషిస్తుంది.

పశువైద్యాన్ని ఆధునిక శాస్త్రీయ పద్ధతులలో పరిశోధన చేయడానికి ఉత్తరప్రదేశ్ లోని బరెల్లీ సమీపంలో ఒక బ్రహ్మాండమైన సంస్థవున్నది. ఇది ప్రత్యక్షంగా కేంద్రప్రభుత్వ యాజమాన్యానే నడుస్తున్నది. ఇంత ప్రముఖమైన పశువైద్య పరిశోధనా కేంద్రం ప్రాచ్యఖండం మొత్తంమీదే లేదని ప్రతీతి. ప్రపంచం మొత్తంమీదవున్న మూడు ప్రముఖ పశువైద్య కేంద్రాలలో ఇదొకటి. దీనిపేరు "ఇజత్ నగర్ పశువైద్య పరిశోధనాకేంద్రం". బరెల్లీ పట్టణానికి నాలుగు మైళ్ళ దూరంలో వున్నది.

ఇది మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చినపిమ్మట ఏర్పాటైన సంస్థకాదు. దీనికి 66 ఏళ్ల చరిత్రవున్నది. ఐక్యాత్రితం ఇది అతిజయప్రదంగా వజ్రోత్సవాన్ని సైతం జరుపుకున్నది.

నూతన రాజ్యాంగం ప్రకారం పశుగణాభివృద్ధి, పశుపోషణ సమస్యలు రాష్ట్ర ప్రభుత్వాలకు సంబంధించినవి. అయితే కొత్తపరిశోధనల ఫలితాలను దేశవ్యాప్తంగా సమన్వయం చేయవలసిన బాధ్యత వున్నది కాబట్టి, ఈ పరిశోధనా పరిషత్తుల మీద కేంద్రప్రభుత్వమే యాజమాన్యం వహించవలసివస్తున్నది. ఇజత్ నగర్ పరిశోధన కేంద్రం అందుచేత భారత ప్రభుత్వ ఆధ్వర్యాన వివిధ కార్యక్రమాలను కొనసాగిస్తున్నది.

* * *

ఏపరిస్థితులలో ఇజత్ నగర్ పశువైద్య పరిశోధన కేంద్రం ఏర్పడ్డదీ తెలుసుకుందాము.

అనేకరకాల వ్యాధులు ప్రబలి, దేశంలో పశువులు విపరీతంగా చచ్చిపోతున్నప్పటికీ, దాదాపు 70 సంవత్సరాల క్రితం వరకూ విదేశీ ప్రభుత్వం పశురోగ చికిత్స విషయంలో శ్రద్ధ వహించలేదనే చెప్పాలి. పశువైద్య శస్త్రచికిత్సాశాస్త్రంలో నిపుణుడైన విలియం మూర్ క్రాఫ్ట్ అనే అతనిని ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రభుత్వం 1808 లో లండన్ నుంచి భారతదేశానికి పిలిపించింది. సైన్యం ఉపయోగించే గుర్రాలలో అనేక వ్యాధులు ప్రబలి వాటి సామర్థ్యం సన్నగిలుతున్న కారణం చేతనే, అతణ్ని పిలిపించారు. అతడు చేసిన విధానాల ఫలితంగా, భారతదేశ సైన్యశాఖలో 1827 లో పశువైద్య ఉపశాఖ ఒకటి ఏర్పడింది. ప్రజావసరాలకంటే సైనికావసరాలు వాటికి ఎక్కువ ప్రధానంగా కనబడివుండడంలో ఆశ్చర్యమేమీలేదు. 1850 వరకూ ఇక్కడ పశువైద్య శాస్త్రంలో పరిశోధనలంటూ ఏవీ జరగలేదనే చెప్పాలి. కర్నల్ జె. హెచ్. బి. హాలెన్ అనే మరొక ఆంగ్లేయుడు 1850 లో ఆనాటి-సైనిక పశువైద్యశాఖలో చేరాడు. ఇతడికృషి ఫలితంగా 1862 లో పూనాలో, సైనికావసరాల నిమిత్తమే-పశువైద్య పాఠశాల నొకదాన్ని స్థాపించాడు. 1869 లో ఇతడే ప్లేగ్ వ్యాధి విచారణసంఘానికి అధ్యక్షుడు కూడా అయినాడు. సైనికావసరాలకేగాక,ప్రజావసరాలకు కూడా భారతదేశంలో పశువైద్యసహాయం లభ్యమయేట్లు చేయాలని మొట్టమొదట గ్రహించిన ఆంగ్లేయుడు ఇతడే. కేవలం ప్రజల అవసరాల నిమిత్తమే ఒకచోట "సివిల్ వెటరినరీ స్కూల్" అనేపేరుతో ఒక చిన్న పశువైద్యపాఠశాలను స్థాపించాడు. ప్రభుత్వంలో "సివిల్ వెటరినరీ శాఖ" ఒకటి ఏర్పడడానికి కూడా కారణభూతుడు అయినాడు. ఆనాడు సైనిక శాఖలో పనిచేస్తున్న 18 మంది పశువైద్యులను అశాఖకు మార్పించాడు. పశువులకు అతి తరుచుగా సంభవిస్తున్న ప్రమాదభరితమైన వివిధ వ్యాధులనూ శాస్త్రబద్ధమైన పద్ధతిలో పరిశోధించాలనీ, తద్వారా ఆర్థికవ్యవస్థ దెబ్బతినకుండా చూడాలనీ, ప్రజలలో, పాలకులలో కొంతవరకు ప్రథమంగా ఉత్సాహాన్ని కలిగించిన ఖ్యాతి ఇతడిదే. పశువైద్యశాఖకు ఇతడు చివరకు ఇన్స్పెక్టర్ జనరల్ అయినాడు.

నాధ్యమైనన్ని సౌకర్యాలతో ప్రత్యేకపశువైద్య పరిశోధనాలయాన్ని స్థాపించడం అవసరమని ప్లేగ్ వ్యాధి విచారణసంఘం 1885లో ప్రభుత్వానికి సిఫార్సుచేయడం, దాన్ని 1896 లో అప్పటి ఇండియామంత్రి ఆమోదించడం జరిగింది.

* * *

పూనా శాస్త్రకళాశాలలో దాని ప్రిన్సిపాలు డాక్టరు థియొడోర్ కుక్ అనే అతడి ఆధ్వర్యాన పశువైద్య పరిశోధన సాగించాలని అప్పటిప్రభుత్వం ఆదేశించింది. డాక్టర్ కుక్ 1889 లో యూరపులో పర్యటించి అక్కడసాగుతున్న వ్యాధిక్రిమి పరిశోధనలను తెలుసుకున్నాడు. పరిశోధనాలయానికి కావలసిన పరికరాలను కొని తెచ్చాడు. సూక్ష్మదర్శిని యంత్రాలతో వ్యాధి క్రిముల పరిశోధననిమిత్తం "ఇంపీరియల్ బక్టీరియాలజిస్టు" అనేహోదాలో డాక్టరు అల్ఫ్రెడ్ లింగార్డు అనే ప్రఖ్యాత ఆంగ్లేయునిసేవను లభ్యం చేసుకున్నాడు. డాక్టరు లింగార్డు జర్మనీలో అనేక సంవత్సరాలపాటు వుండి వైద్యశాస్త్రంలో ఉన్నతవిద్య నభ్యసించాడు, అఖండ ప్రతిభాశాలి. 1890 మొదలు 1907 వరకూ 17 ఏళ్లపాటు నిర్విరామంగా ఈ పరిశోధనాకేంద్రం అభివృద్ధికి, ఖండాంతరాలలో దీని ఖ్యాతివ్యాప్తికి అపారమైన కృషి చేసిన ప్రముఖుడు లింగార్డ్. పూనాలో వుండగానే ఇతడికి సుప్రసిద్ధ జర్మను శాస్త్రవేత్తలు డాక్టర్ కాచ్, డాక్టరు ప్లయిషర్ అనే మరిఇద్దరి సహాయ సంపద కూడా లభ్యమైంది. పెరు ముక్కుపూకలసి పశువులకు సంభవించే అతిప్రమాదకరమైన పాదరుడు వ్యాధి ('డిస్టెంపర్ కేస్' అని ఇంగ్లీషులో అంటారు) నిరోధానికి ప్రత్యేక టీకాలముందును కనిపెట్టారు.

పరిశోధనాలయాన్ని మొదట పూనాలో స్థాపించినప్పుడు, తర్వాత దాన్ని ఉత్తరప్రదేశ్ లోని హిమాలయ పర్వతప్రాంతంలో వున్న ముక్తేశ్వర్ అనే మరోచోటుకు మార్చినతర్వాత కూడా డాక్టరు లింగార్డ్ ఒక ఋషీశ్వరుడు మాదిరిగా ఏకాగ్రమనస్కుడై తన పశుచికిత్సా పరిశోధనలను సాగించాడని చెబుతారు. వాస్తవానికి ప్రస్తుతము ఇజత్ నగర్ లో వున్న పరిశోధనాలయానికి "లింగార్డ్ పరిశోధనాలయం" అనేపేరు పెట్టివుంటే, ఆయన చేసిన సేవకు ఉత్తమస్మృతిచిహ్నంగా వుండేదని పలువురి శాస్త్రవేత్తల అభిప్రాయం.

* * *

పూనా వాతావరణం పశువైద్య చికిత్సా పరిశోధనలు సాగించడానికి అనుకూలమైనదిగా కనబడలేదు. తయారుచేసిన ఔషధాలను పదిలపరచడానికి అక్కడి శీతోష్ణస్థితి పెద్ద ప్రతిబంధకంగా పరిణమించింది. అందుచేత స్థాపించిన మూడేళ్ళలోనే పరిశోధనాలయాన్ని ముక్తేశ్వర్ కు మార్చవలసివచ్చింది. ముక్తేశ్వర్ హిమాలయ పర్వతపాదాలలో 7700 అడుగుల ఎత్తునవున్న గ్రామం.

కేవలం ఏ పర్వతాగ్రాలమీదనో కూర్చుని శాస్త్రవేత్తలు పరిశోధనలు చేయడం సులభమే అయినప్పటికీ, సాధించిన పరిశోధనా ఫలితాలను ప్రజలలో వినియోగానికి తీసుకొని రావడం పెద్ద సమస్య అయింది. అందుచేత జనపదాలకు అందుబాటులో వుండే మైదాన ప్రాంతాలలో పరిశోధనశాఖ నొకదాన్ని స్థాపించవలసిన అగత్యం ఏర్పడింది. బరెల్లీ నగరానికి అనతి దూరంలోనే వున్న "కార్గయినా" అనే కుగ్రామంలో మొదట తాత్కాలికంగా ఒక చిన్న శాఖను ఏర్పాటు చేశారు. గ్రామాలకు అందుబాటులో ఒక చిన్న శాఖ వున్నందువల్ల అట్టే ప్రయోజనంలేదనీ, పెద్ద పరిశోధనా కేంద్రమే వుండాలని నిర్ణయించి 1913 లో బరెల్లీ సమీపంలోనే వున్న ఇజత్ నగర్ అనేచోట విశాలమైన స్థలాన్ని సేకరించారు. అయితే ప్రథమ ప్రపంచసంగ్రామం కారణంగా ఇజత్ నగర్ కు కేంద్రాన్ని మార్చడం 1922 లో గాని సాధ్యపడలేదు.

"ఇంపీరియల్ బెక్టిరియోలాజికల్ లెబొరెటరీ" అనేపేరును 1925 లో "ఇంపీరియల్ వెటరినరీ ఇన్ స్టిట్యూట్" అని మార్చారు. దేశం స్వతంత్రమైన తరువాత "ఇంపీరియల్" అనేమాటను వదలివేసి "ఇండియన్ వెటరినరీ రిసర్చి ఇన్ స్టిట్యూట్" అన్నారు.

* * *

దాదాపు వెయ్యి ఎకరాల విస్తీర్ణం గల ఆవరణంలో వివిధశాఖలకు విశాలమైన ప్రత్యేక భవనాలను ఏర్పాటు చేసుకొని ఇజత్ నగర్ పశు వైద్యపరిశోధనా కేంద్రం పనిచేస్తున్నది. ఆయేటికాయేడు శాఖోపశాఖలుగా విస్తరించి సర్వతోముఖంగా అభివృద్ధి చెందుతున్నది. బెంగుళూరు పరిశోధనాలయంలోవున్న రసాయనిక పరిశోధన ఉపశాఖను 1930 లో ఇజత్ నగర కేంద్రానికి మార్చారు. 1938 లో కోళ్ల పరిశోధనశాఖను ప్రారంభించారు. ప్రస్తుతం ఆరు విభాగాలుగా ఈ పరిశోధనా కేంద్రం పనిచేస్తున్నది.

(1) రోగనివారణ, వ్యాధిక్రిమి పరిశోధన (2) చీము పరిశీలన (3) పశు ఆహారపరిశోధన (4) కోళ్ళ పెంపకం (5) రసాయనిక పరిశోధన (6) పశు జనన పరిశోధన శాఖలు. ఒక్కొక్క శాఖకి ఒక్కొక్క నిపుణుడు అధిపతిగా వుంటాడు. అతడికింద అనేకమంది సహాయోద్యోగులు పనిచేస్తున్నారు. దాదాపు 80 మంది నిపుణులు వున్నారు. ... సిబ్బందిని, కార్మికులను కూడా చేరిస్తే మొత్తం ... మంది ... వరకూ నిత్యం నిరంతరంగా పనిచేస్తుంటారు.

కృత్రిమ పింధారణద్వారా పశుసంతతిని శీఘ్రగతిని అభివృద్ధిచేయడానికి విశేష కృషిజరుగుతున్నది. ఈశాఖను 1944 లో స్థాపించారు. గొడ్డుబోతు ఆవులను, గేదలను పాడి ఆవులుగా పాడి గేదలుగా మార్చగలుగుతున్నారు. కోళ్ళలో విస్తారంగా చావుకు కారణమైన "రాణిఖేట్ వ్యాధి" నిరోధానికి ప్రశంసనీయమైన ఔషధాన్ని కనిపెట్టి ప్రయోగిస్తు...

ప్రతి కోడిసాయంకాలం ... 200 ... గుడ్లు పెట్టాలి. ... 4200 కు ... సైనా ... పొదిగి పిల్లలు చేయడానికి నీలైన బ్రహ్మాండమైన యంత్రాలను ఉపయోగిస్తున్నారు. వీటినే "జియంట్ ఇన్కుబేటర్స్"

5 వ పేజీ 5 వ కాలం చూడుడు

ప్రపంచ ... ఆవులో ... పరిశోధనా ఫలితంగా ... ఆకారం మార్పుచేయ గలిగారు.

## గంటల పంచాంగం

శ్రీ మన్మథ సం॥ ఫాల్గున బ॥ నవమి 1956- సం॥ ఏప్రిల్ 4 బుధవారం బ॥ నవమి రా 5-16 ఉ షా రా 5-28 వర్జ్యం 11-26 ల 13-14 వ.

బ॥ దశమి ఏప్రిల్ 5 గురువారం శు॥ దశమిపూర్తి శ్రవ పూర్తి వర్జ్యం 9-47 ల 11-34 వ.

ఆంధ్రపత్రిక

ఒరు లేయని యొనరించిన
వరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథములకెల్లన్
(మహాభారతము)

శ్రీ మన్మథ సం॥ ఫాల్గున బ॥ నవమి
బుధవారం

## కాశ్మీరు పట్ల స్పష్ట విధానం

ఇప్పటికి ఏడెనిమిది సంవత్సరాలుగా కాశ్మీరులో జనవాక్య సేకరణపై సంప్రతింపులు జరుగుతూ వున్నవి. సంప్రతింపులు సాగిన కొద్దీ పరిస్థితులు అయోమయంగా తయారైనవి. కాశ్మీరు వ్యవహార పరిష్కారానికి అనుకూలమైన వాతావరణం ఏర్పడలేదు. శాస్త్రబద్ధము, న్యాయసమ్మతము యథార్థపరిస్థితులకు అనుగుణము అయిన పరిష్కార ప్రతిపాదనలను అన్నింటినీ పాకిస్తాన్ తిరస్కరిస్తూ వచ్చింది. కాశ్మీరు వ్యవహారంలో తమ దుష్టపాత్రను కప్పిపుచ్చుకొనడానికి ఐక్యరాజ్య సమితిలో పాకిస్తాన్ ప్రతినిధులు అసందర్భము, అప్రస్తుతము అయిన విషయాలను ఎన్నింటినో ప్రస్తావిస్తూ వచ్చారు. హైదరాబాద్‌పై భారత ప్రభుత్వం జరిపిన పోలీసు చర్యపై పాకిస్తాన్ ప్రతినిధి ఒక ఫిర్యాదు దాఖలు చేశారు. జునాఘడ్ విముక్తిపై మరొక ఫిర్యాదు చేశారు. ఈ రెండూ గాక భారత ప్రభుత్వం ముస్లింలను నానాహింసలు పెట్టి అసలు జాతినే నిర్మూలించడానికి ప్రయత్నిస్తున్నట్లు ఆరోపణ చేశారు. వీటన్నింటివల్లా కాశ్మీరులో భారతప్రభుత్వమే దురాక్రమణ చేసినట్లు ఋజువు చేయగలమని పాకిస్తాన్ ప్రతినిధులు ఆశించారు. భారతదేశంపై ఎన్ని ఆరోపణలు చేసినా పాకిస్తాన్ వాదం బలపడలేదు. ఈ ఆరోపణలు అన్నీ నిరాధారమైనవేనని స్పష్టమైంది.

కాశ్మీరుపై దురాక్రమణ జరిపింది పాకిస్తానేనని కూడా ధృవపడింది. కాశ్మీరు భూభాగంపై పాకిస్తాన్ సేనలు వుండడాన్ని ఏవిధంగాను పాకిస్తాన్ ప్రతినిధులు సమర్థింపలేకపోయినారు. దురాక్రమణ ద్వారాగాని, జనవాక్యసేకరణ ద్వారాగాని కాశ్మీరువ్యవహారం తమకు అనుకూలంగా పరిష్కారం కాగల అవకాశం లేదని గ్రహించిన తరువాత పాకిస్తాన్ ప్రతినిధులు సమితి మధ్యవర్తి సంఘం చేసిన ప్రతిప్రతిపాదనలూ తిరస్కరిస్తూనే వచ్చారు. జనవాక్యసేకరణ ఫలితం తమకు అనుకూలం కానిపక్షంలో పాకిస్తాన్ మనుగడకే ముప్పు ఏర్పడవచ్చునని పాకిస్తాన్ ప్రతినిధులు భయపడుతూ వున్నారు. కాశ్మీరు సమస్య ఎంతకూ పరిష్కారం కాకుండా వుండటమే పాకిస్తాన్ పాలకవర్గానికి కావలసింది. ఈ వాస్తవాన్ని గ్రహించే భారత ప్రధానమంత్రి జనవాక్యసేకరణ వ్యవహారంలో తమకు ఇప్పుడు అంత ఆసక్తి లేదని ప్రకటించారు.

పాకిస్తాన్ అధికారులు అప్పుడే శ్రీ నెహ్రూ ప్రకటనకు విపరీతార్థాలు కల్పించడం ప్రారంభించారు. భారతదేశం ఐక్యరాజ్య సమితికి ఇచ్చిన వాగ్దానాలను ప్రధాన మంత్రి నెహ్రూ భంగపరచారని, లోగడ ఇచ్చినమాటకు విరుద్ధంగా వ్యవహరిస్తున్నారని పాకిస్తాన్ అధికారులు ప్రధానమంత్రి ప్రకటనలపై వ్యాఖ్యానం చేశారు.

కాశ్మీరు భవిష్యత్తును కాశ్మీరు ప్రజలే నిర్ధారణ చేయాలని భారత ప్రభుత్వం స్పష్టం చేసిన మాట వాస్తవమే. కాశ్మీరు ప్రజల అభిప్రాయాన్ని, వారి నిర్ణయాన్ని గౌరవించడానికి భారత ప్రభుత్వం ఎప్పుడూ సిద్ధమే. కాశ్మీరు విషయంలో భారతప్రభుత్వం చేసిన వాగ్దానాలు, ప్రధానమంత్రి ఇచ్చిన హామీలు కాశ్మీరుప్రజలకు గాని పాకిస్తానుకు గాదు; ఐక్యరాజ్య సమితికీ గాదు. భారత ప్రభుత్వ ప్రస్తుత విధానాలు, ప్రధానమంత్రి ప్రకటనలు పూర్వపు వాగ్దానాలకు హామీలకు విరుద్ధంగా వున్నవని చెప్పగలవారు, చెప్పవలసిన వారు కాశ్మీరు ప్రజలే. ఐక్యరాజ్య సమితి ముఖ్యంగా కాశ్మీరు ప్రజలకు ఇచ్చిన హామీలను భారత ప్రభుత్వం ఇప్పటికీ పాలిస్తూనే వున్నది. జనవాక్య సేకరణ విషయంలో ప్రస్తుతం తమకు అంత ఆసక్తి లేదని ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ చేసిన ప్రకటన కూడా కాశ్మీరు ప్రజల, ప్రజా ప్రతినిధుల అభిమతాన్ని అనుసరించే వున్నది.

కాశ్మీరు ప్రధాన మంత్రి ఇప్పటికి అనేక సందర్భాల్లో సంస్థాన భవిష్యత్తు నిర్ధారణకు జనవాక్యసేకరణ అవసరం లేదని స్పష్టం చేశారు. కాశ్మీరు ప్రజలు ఎన్నుకున్న రాజ్యాంగ పరిషత్తు రాష్ట్ర భవిష్యత్తుపై తీర్మానం చేసిన తర్వాత, ఆ తీర్మానాన్ని భారత ప్రభుత్వం గౌరవింపకపోవడం కాశ్మీరు ప్రజల నిర్ణయాన్ని అంగీకరింపకపోవడమే అవుతుంది. భారత ప్రభుత్వం కాశ్మీరు సమస్యాపరిష్కారానికి సర్ ఓవెన్ డిక్సన్ ప్రతిపాదించిన పథకాన్ని అంగీకరించింది. అప్పట్నుంచీ కూడా భారత ప్రభుత్వ విధానం ఆ పథకం ఆధారంగానే రూపొందుతూ వుంది. కాశ్మీరు సమస్య శాంతియుతంగా, ప్రజాస్వామిక పద్ధతిలో పరిష్కారం కావడానికి వాస్తవిక దృష్టితో సర్ డిక్సన్ ప్రతిపాదించిన పథకాన్ని తిరస్కరించడంతో పాకిస్తాన్ ఒక అపూర్వ అవకాశాన్ని కోల్పోయింది. ఆ తిరస్కృతి ఫలితాలను పాకిస్తాన్ అనుభవింపక తప్పదు.

భారత ప్రధాన మంత్రి కాశ్మీరు విషయంలో విస్పష్టము, అసందిగ్ధము అయిన విధానాన్ని ఏనాడో అనుసరింపవలసియుండెను. జనవాక్య సేకరణ విషయంలో ఈ వివరణను కాశ్మీరు రాజ్యాంగ పరిషత్తు రాష్ట్ర భవిష్యత్తుపై స్పష్టమైన తీర్మానాన్ని ఆమోదించినప్పుడే చేయవలసియుండెను. పాకిస్తాన్ ఎంత దుష్ప్రచారం చేసినా సత్యం మరుగుపడదు.

### పెకింగ్‌కు శ్రీ మికోయాన్ ప్రయాణం

రంగూన్, ఏప్రిల్ 3: సోవియట్ ఉపప్రధాని శ్రీ మికోయాన్ నేడు పెకింగ్‌కు బయలుదేరారు. ఇక్కడున్న మూడు రోజులలోను శ్రీ మికోయాన్ బర్మా నాయకులతో చర్చలు జరిపి, బర్మా-రష్యా వాణిజ్య సంధిని మరో ఐదేళ్లు పొడిగించారు.

## కొత్త కంపెనీల చట్టం: రిజస్ట్రార్లకు దస్త్రాల అప్పగింత

[శ్రీ కె. ఆర్. సి. అయ్యంగార్]

(నిర్వహణశాఖ సంయుక్త కార్యదర్శి)

అన్ని జాయింటు స్టాక్ కంపెనీలు రిజిస్టరు కావాలనీ, వాటికి సంబంధించినదస్త్రాలనూ నమోదుచేసి ప్రభుత్వకార్యాలయంలో భద్రపరచివుంచాలనీ కంపెనీలచట్టం శాసిస్తున్నది. ఈ కార్యకలాపాలను నిర్వహించేందుకు కంపెనీ రిజిస్ట్రార్ల కార్యాలయాలు నెలకొల్పబడ్డాయి.

కంపెనీలకు సంబంధించిన ఈ వ్యవహారాలను చూసే అధికారం, చట్టం ప్రకారం కేంద్రప్రభుత్వానికే సంక్రమించినా, ఇటీవలి వరకూ కంపెనీల నిర్వహణ వ్యవహారాలను కేంద్రప్రభుత్వం నూటిగా పరిశీలించక, తన అధికారాలను రాష్ట్రప్రభుత్వాలకు దత్తం చేసింది. ఇందుకు ఆర్థిక కారణాలు కూడా వున్నాయి. చట్టాన్ని ధిక్కరించిన సందర్భాలలో కంపెనీలపై చర్య తీసుకునేందుకు రాష్ట్రాలలో సిద్ధంగా పాలక వ్యవస్థ లున్నాయి. పైగా, వ్యాపారరంగంలో ప్రైవేటు పెట్టుబడులను క్రమబద్ధం చేయడంలో కంపెనీల శాసనం వహించవలసిన పాత్రను గురించి సుస్పష్టమైన ఆర్థిక విధానం రూపొందనందున, ఇంతవరకూ కంపెనీలు శాసన ధిక్కారం చేయకుండా నివారించడానికే యీ చట్టం ఉపయోగపడుతూ వచ్చింది.

### కంపెనీల రిజిస్ట్రార్లు

జాయింటు స్టాక్ కంపెనీల రిజిస్ట్రార్లను నియమించే అధికారమూ, వాటి కార్యాలయాలపై కంట్రోలు — ఇవి రాష్ట్రప్రభుత్వాల చేతుల్లో వుండేవి. కొన్ని రాష్ట్రాలు మాత్రమే పూర్తికాలిక రిజిస్ట్రార్లను నియమించాయి. చాలా రాష్ట్రాల్లో పూర్తికాలిక రిజిస్ట్రార్ల నియామకం కానీ, పూర్తికాలిక సిబ్బంది నియామకంగానీ జరగలేదు. 1913-వ సంవత్సరపు కంపెనీలచట్టాన్ని 1951 ఏప్రిల్ 1 వ తేదీన "బి" తరగతి రాష్ట్రాలకు కూడా వర్తింపజేశారు. ఆ రాష్ట్రాలలోకూడా ఈ చట్టం ఏజన్సీ పద్ధతిపైనే అమలు జరిగింది. 1952 వ సంవత్సరంలో నెలకొల్పిన కంపెనీ శాసన విచారణసంఘం యీ పద్ధతిపై వ్యాఖ్యానిస్తూ "వ్యాపార, పరిశ్రమలకు సంబంధించిన కేంద్ర చట్టాలలో అసమర్థంగా అమలు జరుపబడినది బహుశా భారత కంపెనీల చట్టమే" అని పేర్కొన్నది.

ఈపరిస్థితిని చక్కదిద్దడానికి కేంద్ర ప్రభుత్వం కొత్త కంపెనీల బిల్లును ప్రవేశపెట్టకపూర్వమే, కొన్ని చర్యలు తీసుకుంది. కంపెనీల నిర్వహణకు సంబంధించినంతవరకూ రాష్ట్ర ప్రభుత్వాలకు అప్పగించిన అధికారాలను కేంద్రప్రభుత్వం 1953 అక్టోబరు 1 వ తేదీన స్వాధీనపరచుకుంది. రిజిస్ట్రార్ల కార్యాలయాల పునర్వ్యవస్థీకరణ కార్యక్రమం కూడా క్రమబద్ధంగానే సాగింది.

"ఏ" తరగతి రాష్ట్రాలలోనూ, "బి" తరగతి రాష్ట్రాలలోనూ, ఢిల్లీ రాష్ట్రంలోకూడా పూర్తి కాలిక రిజిస్ట్రార్లు ఏర్పాటైనారు. రిజిస్ట్రార్ల కార్యాలయాలలో తగినంతమంది సిబ్బందికూడా నియమితు లయ్యారు. ఆ కార్యాలయాలకు లోప రహితమైన పాలక విధానాన్ని రూపొందించారు. ప్రస్తుతం ఈ రిజిస్ట్రార్ల కార్యాలయాలు మద్రాసు, విజయవాడ, హైదరాబాదు, బెంగుళూరు, తిరువనంతపురము, బొంబాయి నాగపూర్, పంబల్‌పూరు, రాజకోట, కలకత్తా, షిల్లాంగు, పాట్నా, లక్నో, గ్వాలియర్, జయపూర్, పాటియాలా, జలంధర్, న్యూఢిల్లీలలో ఏర్పాటైనవి. (ప్రతి రాష్ట్రంలోనూ ఒక రిజిస్ట్రారు కార్యాలయం నెలకొల్పాలని కొత్త కంపెనీ శాసనం నిర్దేశించలేదు.)

రిజిస్ట్రార్ల కార్యాలయాల కార్యకలాపాలపై యాజమాన్యం వహిస్తూ సమన్వయపరచడమే గాక, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య కూడా ఈ విషయమై అనుబంధాల నేర్పరచడానికి గాను మద్రాసు, బొంబాయి, కలకత్తా, ఢిల్లీలలో ప్రాంతీయ డైరెక్టర్ల కార్యాలయాలు స్థాపించబడ్డాయి. మద్రాసు కేంద్రం క్రిందవున్న దక్షిణ మండలంలో మద్రాసు, ఆంధ్ర, మైసూరు, తిరువాన్కూరు కొచ్చిన్ రాష్ట్రాలు చేరి వున్నాయి. పశ్చిమ మండలంలో బొంబాయి, హైదరాబాదు, మధ్యప్రదేశ్, సౌరాష్ట్రాలూ, తూర్పు మండలంలో పశ్చిమ బెంగాలు, ఒరిస్సా, బీహారు, అస్సాము రాష్ట్రాలూ, ఉత్తర మండలంలో ఉత్తరప్రదేశ్, మధ్యభారత్, రాజస్థాన్, పెప్సూ, పంజాబ్, ఢిల్లీ రాష్ట్రాలూ చేరివున్నాయి. రిజిస్ట్రార్ల కార్యాలయాలవలె కాక, ఈ ప్రాంతీయ వ్యవస్థలను చట్టంలో పేర్కొనలేదు.

అనుభవజ్ఞులైన ఉద్యోగులే ఈ కార్యాలయాల డైరెక్టర్లుగా నియమితులవుతారు. ఈ కార్యాలయాలలో అనుభవజ్ఞులైన ఎక్కౌంటెంట్లూ, కంపెనీశాసన వ్యవహారాల్లో ప్రావీణ్యం సంపాదించిన న్యాయవాదులూ కూడా నియమితులౌతారు. ఈ ప్రాంతీయ కార్యాలయాలు కేంద్ర వ్యవస్థవస్థానిక అంగాలుగా పనిచేస్తూ, అయా రాష్ట్రాలలో కంపెనీల నిర్వహణ, కంపెనీల శాసనం అమలు-వీటికి సంబంధించిన సమాచారాన్ని ఎప్పటికప్పుడు కేంద్ర ప్రభుత్వానికి అందచేస్తూ వుంటాయి. కంపెనీ రిజిస్ట్రారు కార్యాలయాల పనిని అజమాయిషీ చేస్తూ, అవసరమైనప్పుడల్లా వారికి ఈ ప్రాంతీయ కార్యాలయాలు అన్ని విషయాలపై సలహాలనిస్తూ వుంటాయి.

### శాసన నిర్వహణశాఖ

కేంద్రంలో 1955 ఆగస్టు 1 వ తేదీన ఏర్పాటు చేసిన కంపెనీ శాసన నిర్వహణశాఖ కంపెనీ శాసనానికి సంబంధించిన విషయాలను గురించీ, అందుకు సంబంధించిన అన్ని జాయింటుస్టాక్ కంపెనీలనుగురించేగాక, స్టాక్ ఎక్స్చేంజీలూ, జారీఅయిన పెట్టుబడుల కంట్రోలు, ఆర్థికసహాయ సంస్థలూ- వీటికి సంబంధించిన సర్వ విషయాలు ఈ శాఖ పర్యవేక్షణలో వున్నాయి. శాసనం నిర్దేశించినట్లు అన్ని కంపెనీలు తమ కార్యకలాపాలను దిద్దుకునేటట్లు చేయడమే గాకుండా, ప్రణాళికాబద్ధమైన స్వదేశీ ఆర్థిక వ్యవస్థలో ప్రైవేటు రంగం ప్రముఖపాత్ర వహించేటట్లు చూడటమే కంపెనీ శాసన నిర్వహణశాఖ పరమలక్ష్యం.

ఈ శాఖ ఒక కార్యదర్శి ఆధిపత్యం క్రింద పనిచేస్తుంది. ఈశాఖలో రెండు విభాగాలున్నాయి. ఒక విభాగం కంపెని శాసనానికి సంబంధించిన విషయాలను పరిశీలిస్తే, మరొక విభాగం ఈ శాఖకు చెందిన తదితర కార్యకలాపాలను పరిశీలిస్తుంది. ఒక్కొక్క విభాగానికి సంయుక్త కార్యదర్శులుంటారు. కంపెనీల శాసన నిర్వహణలో యీ శాఖకు సహాయపడేందుకు చట్టంలో 410 వ సెక్షను క్రింద ఒక సలహా సంఘం కూడా నియమించబడింది. ఈ సంఘానికి అనధికార ప్రముఖులొకరు అధ్యక్షుడుగా నియమితులౌతారు. జాయింట్ స్టాక్ కంపెనీలూ, వాటాదార్లూ, కార్మికులూ, ఎక్కౌంటెంట్లు ఈ వర్గాలకు ప్రాతినిధ్యం వహించే నలుగురు అనధికారులకు కూడా ఈ సంఘంలో స్థానం వుంది.

కంపెనీలకు చెందిన అన్ని దస్త్రాలను నమోదుచేసి కంపెనీ రిజిస్ట్రారు కార్యాలయాలు భద్రపరచి వుంచుకుంటాయి. ఆ కంపెనీ రిజిస్టర్లు కార్యాలయంలో ఏ దస్త్రాలు వుంచాలో కూడా చట్టం నిర్దేశిస్తున్నది.

చట్టం ప్రకారం కంపెనీలు రిజిస్ట్రార్లకు తెలియజేయవలసిన సమాచారాన్నంతా అవి నిర్ణీతపద్ధతిలో, నిర్ణీత కాలంలో వారికి అందచేసేటట్లు చూసే బాధ్యత రిజిస్ట్రార్లదే. ఆలస్యం అయినా, లేదా ఆ సమాచారం సరియైనది కాకపోయినా రిజిస్ట్రార్లు కంపెనీలను అంజాయిషీ అడగవచ్చు. లేదా వాటిని ప్రాసిక్యూట్ చేయవచ్చు.

సంజాయిషీకూడా సంతృప్తికరంగా లేని పక్షంలోనూ, చట్టం నిర్దేశించిన సమాచారమంతటినీ కంపెనీలు రిజిస్ట్రార్లకు అందజేయని పక్షంలోనూ ఈ విషయాన్ని గురించి కంపెనీల రిజిస్ట్రారు కేంద్ర ప్రభుత్వానికి నివేదించవలసివుంది. ఆ కంపెనీకి పరపతి ఇచ్చిన వాడుగానీ, లేదా ఆ కంపెనీతో సంబంధం గలవాడుగానీ కంపెనీ వ్యవహారాలు సరిగా సాగడం లేదని రిజిస్ట్రారుకు ఫిర్యాదు చేసినప్పుడు, ఆ ఫిర్యాదు సాధారణంగా చేసుకుని కంపెనీల రిజిస్ట్రారు ఆ విషయాన్ని కేంద్ర ప్రభుత్వానికి నివేదిస్తారు. ఇందువల్ల కంపెనీధనం దుర్వినియోగం కాకుండా కంపెనీ వ్యవహారాలు సక్రమంగా సాగడానికి వీలు కలిగింది.

కంపెనీ రిజిస్ట్రార్లకు చట్టబద్ధంగా సంక్రమించిన అధికారాలకు తోడు, వారు కంపెనీ వ్యవహారాలను గురించి ఫిర్యాదులు వచ్చినప్పుడు, ఆ ఫిర్యాదు చేసినవారితోనూ, కంపెనీ ప్రతినిధులతోనూ సంప్రదింపులు జరిపి, ఆ విషయాన్ని చక్కబరచవచ్చు. ఈ సందర్భంలో ప్రాంతీయ డైరెక్టర్ల కార్యాలయాల ప్రవీణుల సలహా సహాయాలను కూడా కంపెనీ రిజిస్ట్రార్లు పొందవచ్చు.

## కాశ్మీరు సమస్యపై పాక్ సన్నాహాలు

1 వ పేజీ 6 వ కాలం తరువాయి

దర్ మిర్జా ప్రకటించారు.

లాహోర్ పౌరసన్మానం స్వీకరిస్తూ శ్రీ మిర్జా "పాకిస్తాన్‌ను పట్టిన దీక్ష నుండి ఈ ప్రపంచంలో ఎంతటి శక్తి గాని విరమింప చెయ్యలేదు" అన్నారు.

శ్రీమిర్జా ఏప్రిల్ 8 వ తేదీన ఆజాద్ కాశ్మీర్ వెడుతున్నారు.

## రాయబారాలింక నిష్ప్రయోజనం

### "ఆజాద్ కాశ్మీర్ మంత్రివర్గ తీర్మానం"

లాహోర్, ఏప్రిల్ 2: కాశ్మీరు వివాదంపై రాయబారా లింక ఫలించే అవకాశం లేదని "ఆజాద్ కాశ్మీర్ మంత్రివర్గం" తీర్మానం చేసింది.

"ఈ సమస్యను తిరిగి ఐక్యరాజ్య సమితికి సమర్పించే యత్నాలకు పార్టీలూ, కాశ్మీరును ప్రపంచ సంస్థ విడిపించలేని పక్షంలో, కాశ్మీర్ ప్రజలే అన్యమార్గాలు అనుసరించడానికి పెను దియ్యరు" అని మంత్రివర్గం ప్రకటించింది.

కాశ్మీరుపై పాకిస్తాన్ అధ్యక్షులు, ప్రధాని చేసిన ప్రకటనలను మంత్రివర్గం ఆమోదించింది.

## తూర్పు పాకిస్తాన్‌కు భారతదేశపు బియ్యం

ఢక్కా, ఏప్రిల్ 2: భారతదేశం తూర్పు పాకిస్తాన్‌కు 11 వేల టన్నుల బియ్యాన్ని సరఫరా చేసింది. దీంతో తూర్పు పాకిస్తాన్ ప్రభుత్వం 18 పట్టణాలలో పూర్తి బియ్యపు రేషనింగును అమలు జరుపుతుంది.

మిగిలిన 4 వేల టన్నుల బియ్యం త్వరలో ఇక్కడికి చేరుతుంది.

అమెరికా 40 వేల టన్నుల బియ్యాన్ని మేనెల మొదటి వారంలో పాకిస్తానుకు పంపుతున్నది.

## 'ఆంధ్ర ప్రదేశ్'కు సమ్మతి

1 వ పేజి 6వ కాలం తరువాయి

ప్రదేశ్ ప్రభుత్వ కార్యాలయ భవనాలకి నమూనాలు హైదరాబాద్ ముఖ్యమంత్రి తెచ్చి ఆంధ్ర ముఖ్యమంత్రికి చూపారు. వానిని జాగ్రత్తగా పరిశీలించి ఆమోదించడంకోసం వానిని ఇచ్చారు. అవసరమైతే ఆంధ్ర మంత్రులూ, ప్రభుత్వోద్యోగులూ స్వయంగా హైదరాబాద్ వెళ్లి, నూతన శాసన సభాభవనం, శాసన సభ్యుల వసతి ఏర్పాట్లను చూడవచ్చుని. కూడా శ్రీ రామకృష్ణరావు, శ్రీ గోపాలరెడ్డితో చెప్పారు. ఉన్న శాసనసభాభవనాన్నే పెంచడానికి వీలున్నదని భావిస్తే సరే సరి - లేదా కొత్తభవనం నిర్మించవచ్చునని శ్రీ రామకృష్ణరావు చెప్పారు.

కార్యాలయ భవనాల విషయం ప్రసంగిస్తూ, శ్రీ రామకృష్ణరావు, అవసరాలను గమనించి అదనంగా భవనాలను సేకరించవలసి ఉంటుందని చెప్పారు.

## అక్టోబరులోగా తరలింపు కష్టం

### త్వరలో మంత్రుల చర్చలు: విలీనమే సాధ్యం

కార్యాలయవసతి మొదలైన అన్ని సమస్యలనూ చర్చించడానికి త్వరలో ఉభయప్రాంతాల మంత్రులూ, ప్రభుత్వాధికారులూ సమావేశాలు జరపగలరనికూడా శ్రీ రామకృష్ణరావు చెప్పారు. నూతన రాష్ట్రనిర్మాణ కాలానికి, అనగా అక్టోబరు నెలలోగా కార్యాలయాలను హైదరాబాద్‌కు తరలించడం సాధ్యంకాకపోవచ్చునని చెప్పారు. ప్రభుత్వ ప్రధానకార్యాలయాని కొక భవనాన్ని నిర్మించాలి. ఆ భవనం నమూనాలు తెచ్చినట్లు చెప్పారు. అయితే విలీన కార్యక్రమం మాత్రం అక్టోబరులోగా పూర్తి కావలసిందే నన్నారు. సకలసమస్యలనూ అందరి సుహృద్భావంలో పరిష్కరించ, భారతదేశంలోకెల్ల ఆంధ్రప్రదేశ్ అగ్రగణ్యమైనదిగా వృద్ధిపరచాలని శ్రీ రామకృష్ణరావు అన్నారు.

## ఘనస్వాగతం

ఉదయం హైదరాబాద్ నాయకులకు కర్నూలు రైల్వే స్టేషన్‌లో ఆంధ్రనాయకులు, పౌరులు ఘనస్వాగతం ఇచ్చారు. నాయకులు పలువురినీ పూలమాలలలో ముంచెత్తారు.

ఉపముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి, మంత్రులు శ్రీ లచ్చన్న, శ్రీ ఓబుల రెడ్డి, ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు, శ్రీ విజయభాస్కరరెడ్డి, శ్రీ మండెన సంకట్రాజు మొదలైన పలువురు హైదరాబాదు నాయకులను స్టేషనులో ఆహ్వానించారు. హైదరాబాదు నుంచి శ్రీమందుముల నరసింగరావు కూడా వచ్చారు.

ఆంధ్ర ముఖ్యమంత్రి వారికి మధ్యాహ్నం తమ వసతి భవనంలో విందు చేశారు.

హైదరాబాదు ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావు ఇవాళ ఉదయం గవర్నర్ శ్రీ త్రివేదిని రాజభవనంలో దర్శించారు.

హైదరాబాదు నాయకులు శ్రీరంగారెడ్డి, శ్రీ చెన్నారెడ్డి, శ్రీ నరసింగరావు ఇవాళ ఆంధ్ర శాసనసభ కార్యక్రమాన్ని వీక్షించారు. ఆ సమయంలో ప్రశ్నోత్తరాలు జరిగాయి. కొత్త రాష్ట్రాల బిల్లుపై చర్చ జరిగింది.

నూతన రాష్ట్రానికి ఎగువసభ వుండాలనే విషయంపై ఆంధ్ర, హైదరాబాద్ ప్రాంత నాయకుల మధ్య ఏకాభిప్రాయం కుదిరినందుకు శ్రీ జె. వి. నరసింగరావు ఆంధ్ర పత్రిక ప్రతినిధికి హర్షం తెలిపారు.

కర్నూలు వచ్చి ఆంధ్ర మిత్రులతో తిరిగి సన్నిహిత మైత్రి బాంధవ్యాలు ఏర్పరచుకుంటున్నందుకు ఆనందిస్తున్నట్లు డా॥ చెన్నారెడ్డి చెప్పారు.

ఈకర్నూలు సమావేశం ఈవిధంగా జరపాలని తిరుపతి వెడుతున్న సమయములో తమకు తోచిందని హైదరాబాద్ ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావు చెప్పారు. తమ సూచనపైన ఈ సమావేశం జరిగిందన్నారు. కొత్త రాష్ట్రం పేరు, హైకోర్టులను గురించి చర్చింప బోతున్నట్లు తెలియజేశారు.

## కాందిశీకులకోసం ప్రణాళికలో 125 కోట్లు

### లోక్‌సభ ఆమోదం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 2: కాందిశీకుల పునరావాసంకోసం ద్వితీయ ప్రణాళికలో రూ 125 కోట్ల రూపాయలు కేటాయించారనీ అవసరమయితే ప్రణాళిక మూడో సంవత్సరంలో దీనిపై ప్లానింగు కమిషన్ పునః పరిశీలన జరుపుతుందనీ కేంద్ర పునరావాస మంత్రి శ్రీ మెహర్‌చంద్ ఖన్నా నేడులోక్‌సభలో ప్రకటించారు.

"పశ్చిమ పాకిస్తాను కాందిశీకులకూ, తూర్పు పాకిస్తాను కాందిశీకులకూ తేడా ఉన్నది. పశ్చిమ పాకిస్తాను నుంచి వచ్చే కాందిశీకులు వస్తూవుంటే అక్కడికి పోయేవారు కూడా ఉన్నారు. అందువల్ల పునరావాసం కొంత సులభమయింది. కాని తూర్పు పాకిస్తాను నుంచివచ్చే వారికాని వెళ్ళేవారు లేరు. మొదట్లో వెళ్ళిన ముస్లిములు నెహ్రూ-లియాకత్ ఒప్పందంకింద తిరిగివచ్చారు. తూర్పు పాకిస్తాను కాందిశీకులు నానాటికీ పెరిగిపోతున్నారు." అని ఆయన వివరించారు.

ఈ కాందిశీకుల తాకిడి బెంగాల్, అస్సాం, త్రిపురాలకు ఎక్కువ వున్నదని అన్నారు. ఇప్పటికి 2 1/4 లక్షల కుటుంబాలకు భూము లివ్వటం, 160 వేల కుటుంబాలకు గ్రామాల్లో వృత్తులు కల్పించటం, మరి 2 లక్షల కుటుంబాలకుఇతరత్రా పనులు చూపించటం జరిగిందని ఆయన తెలియజేశారు.

కాందిశీకులు భారత పాకిస్తానులలో వదిలివెళ్ళిన స్థిరాస్తులకు విలువ కట్టడంలో ఉభయదేశాలకూ సమ్మతమయిన అంతర్జాతీయ మధ్యవర్తులను ప్రతిపాదించాలని సూచించారు.

పాకిస్తాన్‌లో వాతావరణం పూర్తిగా మారిపోయిందనీ, కిందటి నెల తాషుకరా చీలో చూచిన పరిస్థితులకూ, కిందటి సంవత్సరం పరిస్థితులకూ సంబంధమే లేదనీ శ్రీ ఖన్నా అన్నారు.

శ్రీ ఖన్నా వివరణ పూర్తి అయిన తరవాత లోక్‌సభ పునరావాస శాఖ పద్దులను ఆమోదించింది.

## ఆంధ్రలో భూసంస్కరణలకు తొందరపడ కూడదు

హైదరాబాద్ రాష్ట్రం అతిముఖ్యమయిన భూ సంస్కరణలను అమలు జరిపి దేశాని కంతటికీ మార్గదర్శక మైనదని శ్రీ జె. వి. నరసింహారావు అన్నారు. ఇప్పుడు ఆంధ్ర ప్రభుత్వం భూసంస్కరణల కోసం తొందరపడరని ఆశిస్తున్నట్లు చెప్పారు. ఆవిధంగా తొందరపడరని ఆంధ్ర ముఖ్యమంత్రి ఆంధ్ర శాసనసభలో వాగ్దాన మిచ్చినందుకు శ్రీ నరసింగరావు సంతోషం తెలియపరిచారు.

## ఈనాందార్లకు స్వంత సేద్యం

పట్టాదార్లకు స్వంతసేద్యానికి కొంత భూమిని విడిచి పెడుతున్న విధంగానే, ఈనాందార్లకుగూడా స్వంత సేద్యానికి కొంత భూమిని విడిచిపెట్టాలని శ్రీ నరసింగరావు అన్నారు.

ఉభయప్రాంతాలలోనూ రెవిన్యూ విధానం, రెవిన్యూ శాసనాలు భిన్నంగా ఉన్నప్పటికీ, ఉభయ ప్రాంతా ప్రాంతాలకూ చెందిన అనుభవజ్ఞులైన ఉద్యోగులను నియమించినట్లయితే ఒక రెవిన్యూబోర్డు స్థాపించి నిర్వహించడం కష్టం కాదన్నారు.

## హైదరాబాదు న్యాయవాదుల భయం

గుంటూరులో వేరే హైకోర్టుబెంచి స్థాపించవలసిన అవసరం ఏమిటని ప్రశ్నించగా, ఇతర న్యాయవాదుల ప్రాబల్యం ఎక్కువైపోతుందని హైదరాబాదు న్యాయవాదులు భయపడుతున్నారని శ్రీ నరసింహారావు చెప్పారు. సర్కారు జిల్లాల న్యాయవాదులది పైచెయ్యి కావచ్చునన్నారు.

రాయలసీమను హైదరాబాదు ప్రాంతంలో చేర్చి ఒకే ఉన్నత న్యాయస్థానానికి న్యాయ విచారణాధికారం యివ్వవచ్చునని తమకులతో వారిందరి ఒప్పించినట్లు శ్రీ నరసింగరావు చెప్పారు.

విలీనం అనంతరం కొత్తరాష్ట్రాన్ని నాయకులమధ్యా ప్రజలమధ్యా సహకార సామరస్యాలలో సక్రమంగా నిర్వహించగలరని ఆశిస్తున్నట్లు శ్రీ నరసింగరావు చెప్పారు.

## బ్యాంకు సిబ్బంది జీతాలు

### తరుగులు లేకుండా రాజీ పద్ధతి

బొంబాయి, ఏప్రిల్ 2: బ్యాంకు ఉద్యోగుల వేతనాల తగ్గింపుపై వివాదాన్ని పరిష్కరించడానికి ఒక రాజీ పద్ధతిని బ్యాంకర్లు స్వయంగా పదిహేను రోజుల్లో ప్రకటించగలరని తెలుస్తోంది.

కిందటివారం కేంద్ర కార్మికమంత్రి శ్రీ ఖండూభాయ్ దేశాయ్, భారత బ్యాంకులసంఘ అధ్యక్షులు ద్రవ్యవ్యవహారకపు బ్యాంకుల సంఘం అధ్యక్షుడు, స్టేట్‌బ్యాంక్ అధ్యక్షుడుకలిసి చర్చించి ఈ రాజీపద్ధతిని తయారుచేశారట. ఉద్యోగుల తరఫున కేంద్రమంత్రే స్వయంగా వాదించారట.

ఈ రాజీపద్ధతి ఏమిటంటే, ఇప్పటికి జీతాల్లో తగ్గించినమేరకు భర్తీ చేయరు, ఇందుకు ఉద్యోగులు ఒప్పుకోవాలి. ఇకముందు తరుగులు ఉండకూడదు; ఇందుకు యజమానులు ఒప్పుకోవాలి.

బ్యాంకు ఉద్యోగుల జీతాల వివాద శాసనం (1955) ప్రకారం ఉద్యోగుల జీతాల్లో మూడుసార్లు కోతపడుతుంది. ఇంతవరకు అప్పుడే ఒక కోత అమలు జరిగింది. రెండుతరహాలు ఇంకా అమలు జరగలేదు. ఇప్పుడు రాజీపద్ధతిప్రకారం మొదటికోతకే ఉద్యోగులు ఒప్పుకోవాలి. మిగిలిన రెండురకాలూ యజమానులు అమలుజరపకుండా ఒప్పుకోవాలి. (బ్యాంకు ఉద్యోగులు మొత్తం 12 వేల మంది ఉన్నారు.)

ఈ రాజీపద్ధతిని స్టేట్‌బ్యాంక్ అధ్యక్షులు శ్రీ జాన్‌మతయ్ కలకత్తాలో స్టేట్‌బ్యాంక్ ఉద్యోగుల సమాఖ్య ఏప్రిల్ 20 న జరిగే సందర్భంలో ప్రకటిస్తారని తెలుస్తోంది.

## అల్జీరియాకు లక్ష సైనికులు

### స్వాతంత్ర్య పోరాటాన్ని అణచడానికి

పారిస్, ఏప్రిల్ 2: ఫ్రెంచిప్రధాన మంత్రి శ్రీ గైమొలే యివాళ రక్షణ మంత్రి మారిస్ బార్జెస్‌ను పిలిపించి, అల్జీరియాకు లక్షసైన్యాన్ని ఎలా పంపాలి అనేవిషయం చర్చించాడు.

రోజు వెయ్యిమందిని యిప్పటికే అల్జీరియాకు పంపుతున్నారని, ప్రత్యక్షంగా యుద్ధంలో పాల్గొనని, శాఖల నుండి 30 వేల మందిని పంపడానికి ప్రధానమంత్రి ఒక పథకం తయారు చేశాడని, పారిస్ వార్తాపత్రికలు ప్రకటించాయి.

250000 మంది పౌరులను మాత్రం సైన్యంలోకి తీసుకోదలచినట్లు ఫ్రెంచి ప్రధానమంత్రి చెప్పారని, పారిస్ ప్రెస్ అసోసియేషన్ వార్తాపత్రిక ప్రకటించింది.

క్రిందటి వారం తంలో అల్జీరియాలో 350 మంది దేశభక్తులను ఫ్రెంచి సైన్యాలు హతంచేశాయి.

నిన్న ఫ్రెంచి సైనిక శకటాలపై బాట్నావద్ద తిరుగుబాటుదార్లు పొంచి ఉండి మీదపడి 5 గురు ఫ్రెంచిసైనికులను హతంచేసినట్లు పారిస్‌కు వదంతులు చేరాయి.

## ఫెర్రో మాంగనీసు ఫ్యాక్టరీ

(1 వ పేజీ 8కాలం తరువాయి)

ఫ్యాక్టరీ నడపడానికి తోడ్పడతామని కూడా అంగీకరించారు.

"ఇక రెండవ ఫ్యాక్టరీ, అనగా, "ఫెర్రో ఎల్లాయిస్ కార్పొరేషన్ (పబ్లిక్) లిమిటెడ్" కంపెనీ స్థాపించనున్న "ఫెర్రో మాంగనీస్ ఫ్యాక్టరీ" ఇది మాంగనీస్ నుంచి ఉక్కు, ఇనుము మొదలయిన వాటికి కావలసిన పదార్థాల్ని తయారుచేస్తుంది. దీనివలనమునిపదార్థాలను, విదేశాలకు పంపి, మళ్లా అక్కడ శుద్ధిచేసిన రకరకాలుగా తయారుఅయిన వస్తువులను - చాలాభాగం దిగుమతి చేసుకోవడంతప్పుతుంది. చాలా నష్టాన్ని అరికట్టుకోవచ్చు. ఈ సందర్భంలో మాకు అనేక సాంకేతిక విషయాలలో అమూల్యమయినసలహాలు ఇచ్చి, ఈపరిశ్రమ నిర్మాణానికి కూడ సహకరించిన టెక్నికల్ డైరెక్టర్ శ్రీ మొల్నార్‌కు మేము కృతజ్ఞులం. ఈ రెండు పరిశ్రమలకు రూ. 270 లక్షలు పెట్టుబడి. ప్రస్తుతం ఇందులో రూ. 150 లక్షలు విడుదల చేస్తాము.

### జాతీయకృషిలో భాగం

"ఈ సందర్భంలో ఒక్క ముఖ్య విషయం ప్రస్తావించవలసి వుంది. ఈ పరిశ్రమమీద వచ్చేలాభాలు కుంజాకు పోవడానికి పెట్టుబడి పెట్టడం లేదని చెప్పదలిచాము. పెట్టుబడి పెట్టిన ఈ పెద్ద వ్యయానికి కొంతలాభం ఆశించినా, జాతీయ పారిశ్రామిక పురోభివృద్ధికి నేడు దేశంలో జరుగుతున్న బ్రహ్మాండమయిన కృషిలో ఇది కూడా కొంతగా మేము గ్రహించ కోరిక."

తరువాత టెక్నికల్ డైరెక్టర్ శ్రీ మొల్నార్ ఫ్యాక్టరీలకు సంబంధించిన సాంకేతిక విషయాలు నివేదించారు.

సమావేశానికి శుభాకాంక్షలు తెలియచేస్తూ, లోక్‌సభ సభాపతి శ్రీ అనంతశయనం అయ్యంగార్, ఉత్పత్తిమంత్రి శ్రీ కె. సి. రెడ్డి, సమాజ సంపదల మంత్రి శ్రీ మాలవ్యా, ప్రముఖ పారిశ్రామికవేత్తలు శ్రీ జి. డి. బిర్లా, సేఠ్ దాల్మియా మొదలగువారు పంపిన సందేశాలను సభలో చదివారు.

ఉత్సవంలో ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు శ్రీ వి. యస్. కృష్ణ, మాజీ విద్యాశాఖా మంత్రి శ్రీ యం. వి. కృష్ణారావు, ప్రదేశ్ కాంగ్రెసు కార్యదర్శి శ్రీ పెన్మత్సరాజా వెంకటరావు, జిల్లా కాంగ్రెసు కార్యదర్శి శ్రీ బి. రామసింగ్, కార్మిక పరిశ్రమల ప్రతినిధి శ్రీ గిరీశ్, ఇండియా బ్యాంకు ఏజంటు శ్రీ ప్రధాన్ శ్రీ రాందాస్ జీ, డా॥ బి. వి. సంజీవరావు, తదితర ప్రముఖులు పాల్గొన్నారు.

## ఆసియా ఆఫ్రికాలలో స్వయం నిర్ణయాధికారం

### ప్రజల కోరిక అదేనని అమెరికాలో శ్రీ మెహతా వివరణ

ప్రిన్స్‌టన్ (న్యూజెర్సీ), ఏప్రిల్ 2: ఆసియా, ఆఫ్రికా ఖండాల ప్రజలు తమ భవిష్యత్తుని తామే తీర్చి దిద్దుకోడానికి స్వయం నిర్ణయాధికారాన్ని కోరుతున్నారని ఇక్కడి భారత రాయబారి శ్రీ జి. యల్. మెహతా అంతర్జాతీయ వ్యవహార విద్యాలయంలో వుడ్రో విల్సన్ శతాబ్ది-జయంతి ఉత్సవంలో మాట్లాడుతూ చెప్పారు.

ప్రథమ ప్రపంచ సంగ్రామం అనంతరం అప్పటి అమెరికా అధ్యక్షులు సకలదేశాలకూ, జాతులకూ స్వయం నిర్ణయాధికారం లభించాలని ప్రతిపాదించారు. ఈసిద్ధాంతం క్రియలో ఎన్ని కష్టాలున్నప్పటికీ ప్రపంచ మంతటా జాతీయ స్వాతంత్ర్య కాంక్షలకు దోహదమిచ్చింది.

కాని వెర్సైల్స్ సంధి సమస్యపై వుడ్రోవిల్సన్ అమెరికా ఎన్నికల్లో ఓడిపోయారు.

అప్పుడు విల్సన్ మాట చెల్లివుంటే, అమెరికా నానాజాతి సమితిలో చేరి వుంటే రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో ప్రపంచ చరిత్ర గతి వేరుగా ఉండేదేమో అని శ్రీ మెహతా అన్నారు.

## ఆగ్నేయ ఆసియా ప్రాముఖ్యం

### పత్రికా విలేఖరులకు శ్రీ నెహ్రూ సలహా

న్యూఢిల్లీ, ఏప్రిల్ 2: ఆగ్నేయ ఆసియాకు సంబంధించిన విషయాలకు ఎక్కువప్రాధాన్యం యివ్వాలని ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ, పత్రికావిలేఖరులకు సలహాయిచ్చారు.

ప్రస్తుత ప్రపంచపరిస్థితుల దృష్ట్యా, ఆగ్నేయాసియా చాలా ముఖ్యమైనప్రాంతం. అంతేకాక, భారతదేశానికి, యీ ప్రాంతానికి ప్రత్యేక సంబంధం ఉన్నదని, కొంతకీ, వార్తాపత్రికలు విలేఖరులు, ఆగ్నేయ ఆసియాలో జరిగే సంఘటనలను ప్రత్యేక శ్రద్ధతో పరిశీలించాలని శ్రీ నెహ్రూ చెప్పారు.

## కంపెనీల చట్టం నిర్వహణకు కొన్ని ఏర్పాట్లు

న్యూఢిల్లీ, మార్చి 31: ఏప్రిల్ ఒకటవ తేదీన అమలులోకి వచ్చే కొత్త కంపెనీల చట్టాన్ని గురించి వివరాలూ, వ్యాఖ్యలూ తెలుసుకోగోరుతూ ప్రజలు అనేకమంది దరఖాస్తులు చేస్తున్నారు.

ప్రజల సౌకర్యార్థం బొంబాయి, కలకత్తా, మద్రాసు ఢిల్లీలలో ప్రాంతీయ డైరెక్టరు కార్యాలయాలు నెలకొల్పారు. 18 కేంద్రాలలో కంపెనీల రిజిస్ట్రార్లు పనిచేస్తున్నారు. ప్రజలు యీ రిజిస్ట్రార్ల ద్వారా లేదా ప్రాంతీయ డైరెక్టరు ద్వారా కావలసిన వివరాలు తెలుసుకోవచ్చును.

# ఆంధ్ర తెలంగాణాకు ఎగువసభ

## హైదరాబాదు ప్రతిపాదించే సవరణలు

### హైకోర్టు కూడా రాజధాని ఉండే చోటే ఉండేటట్లు చూస్తానని శ్రీ బూర్గుల హామీ

హైదరాబాదు, ఏప్రిల్ 2: ఆంధ్ర - తెలంగాణాకు ఎగువసభ ఏర్పరచాలని తెలంగాణా ప్రాంతంలో 1957 లో ఎన్నికలు జరిపి సభ్యత్వం ఐదేళ్ళవరకు మిగతా వాటితో పాటే వుండేటట్లు చూడాలని కోరుతూ రాష్ట్ర పునర్విభజన బిల్లులో తగు మార్పులను హైదరాబాద్ ప్రభుత్వం చేయగలదని ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావు నేడు శాసనసభలో ఆ బిల్లును చర్చకు ప్రతిపాదిస్తూ తెలియజేశారు. హైదరాబాదులోనే హైకోర్టు స్థానం వుండాలని కోరుతామని కూడా చెప్పారు. ఈ సవరణలను రాష్ట్ర ప్రభుత్వం బుధవారంనాడు ఒక తీర్మానం రూపంలో ప్రతిపాదిస్తుందని చెప్పారు.

1956 సెప్టెంబరులో ప్రధాన న్యాయమూర్తి శ్రీ శ్రీపత్ రావు పల్నిట్కర్ పదవీ విరమణ చేశారు. అన్న వార్త సరికాదని ఆయన 1957 లో పదవీవిరమణ చేస్తారని హైదరాబాదు ప్రభుత్వం ప్రకటించింది.

## హైద్రాబాదులో జాతీయ అభివృద్ధి కేంద్రాలు

హైదరాబాదు, ఏప్రిల్ 1: సామూహికాభివృద్ధి పరిపాలన శాఖ 1956-57 లో హైదరాబాదు రాష్ట్రానికి కేటాయించిన 16 అదనపు జాతీయ అభివృద్ధి కేంద్రాలు:

హైదరాబాదు జిల్లాలో మేడిచలను పరిసర ప్రాంతం. బీదర్ జిల్లాలో నిలంగా, అహమద్ పూర్ ప్రాంతాలు. కరీంనగరం జిల్లాలో హుజూరాబాద్. రాయచూరు జిల్లాలో సింధనూరు. మహబూబ్ నగరం జిల్లాలో కొల్లాపురం. ఆదిలాబాదు జిల్లాలో లక్సెట్టిపేట. వరంగల్లు జిల్లాలో మహబూబాబాదు. ఖమ్మంమెట్టు జిల్లాలో బూర్గంపాడు. మెదక్ జిల్లాలో నర్సాపురం. నల్లగొండ జిల్లాలో భోనగిరి. ప్రతి జిల్లాలో ఒక్కొక్క ప్రాంతం ఎన్నుకున్నారు.

## పజిల్స్ అదుపు చట్టానికి హైదరాబాదు ఆమోదం

హైదరాబాదు, ఏప్రిల్ 2: పజిల్స్ పోటీలను అదుపులో పెట్టే బిల్లును రాష్ట్ర శాసనసభ నేడు మూడవసారి ఆమోదించింది.

అంతకుముందు ఈ బిల్లును ప్రవేశపెడుతూ ఆర్థికమంత్రి శ్రీ వినాయకరావ్ కోరాట్కర్, కేంద్ర చట్టమును మూలంగా హైదరాబాదులో ఇదివరలో ఉంటూవచ్చిన చట్టాన్ని రద్దు చెయ్య వలసి వచ్చిందన్నారు.

## కలరా వ్యాధి

తుంగభద్ర ప్రాంతంలో పనిచేసే కూలీల శిబిరాలలో కలరా వ్యాపించిన మాట నిజమేననీ, అయితే 100 మందికి పైగా చనిపోయారన్నమాట అబద్ధమనీ వైద్యశాఖ మంత్రి నవాబ్ మెహిదీ నవాజ్ జంగ్ నేడు ఒక ప్రశ్నకు సమాధానంగా చెప్పారు. 29 మంది మాత్రం చనిపోయారన్నారు.

## ఇటాలియన్ చిత్రప్రదర్శన

### మదరాసులో రాజాజీచే ప్రారంభోత్సవం

మదరాసు, ఏప్రిల్ 2: ఇటాలియన్ ఛాయా చిత్ర ప్రదర్శనకు శ్రీ రాజగోపాలాచారి గత నెల 29 సాయంత్రం ప్రారంభం చేశారు. దవివర్మ కళామందిలి యీ ప్రదర్శనను క్వీన్ దర్బి మందిరంలో ఏర్పాటుచేశారు.

శ్రీ రాజగోపాలాచారి ప్రసంగిస్తూ కళలను ప్రోత్సహించవలసిన ఆవశ్యకత వివరించారు. కళలను ప్రదర్శించడంకంటె అసలయిన ఇటాలియన్ చాయాచిత్రాలను మామూలు చిత్రాలను ప్రదర్శించేందుకు ఇటలీ రాయబార కార్యాలయం కృషిచేయగలదని ఆశిస్తున్నామన్నారు. ఇటలీ-భారత దేశాల కళారూపాలలో ఏకత్వం, భిన్నత, ముద్ఘటించారు.

ఢిల్లీలోని ఇటాలియన్ రాయబార కార్యాలయ సాంస్కృతిక విభాగ కార్యదర్శి శ్రీ ఐ. గెలాంటే కృషిని ప్రశంసించారు.

శ్రీయుతులు ఎ. యస్. పి. అయ్యర్ కె. వి. వైద్యనాథన్, బేగం అమీరుద్దీన్ ప్రసంగించారు.

## కొహిమాపై నాగాల దాడివార్త అబద్ధం

షిలాంగ్, ఏప్రిల్ 2: నాగా దౌర్జన్యవాదులు నాగాపర్వత ప్రాంతపు జిల్లా ముఖ్యపట్టణం కొహిమాపై దాడిచేశారనే వార్త అబద్ధం అని అస్సాం ముఖ్యమంత్రి శ్రీ విష్ణురామ్ మేధి శాసనసభలో చెప్పారు. పైగా కొహిమాలో నాగాలు బహిరంగ సభలు జరిపి దౌర్జన్యవాదులను విమర్శిస్తున్నారని చెప్పారు. ఆ జిల్లా పూర్తిగా భారతసైన్యం అధీనంలో లేదనీ, సైన్యం అక్కడి అధికారులకు సహాయం మాత్రమే చేస్తున్నారనీ ముఖ్యమంత్రి తెలియచేశారు.

## బొంబాయిపట్ల పక్షపాతం

### రాష్ట్ర శాసనసభలో మంత్రి వాదం

బొంబాయి, ఏప్రిల్ 2: కొత్త రాష్ట్రాల బిల్లుపై బొంబాయి శాసనసభలో చర్చ సాగుతోంది. జునరెవెన్యూమంత్రి శ్రీ హీరే, మాట్లాడుతూ, బొంబాయియాదిరే కలకత్తా, జంషెడ్ పూర్, కాన్పూర్ వంటి నగరాల వృద్ధికి అన్యరాష్ట్రీయులు తోడ్పడినా, బొంబాయినగరాన్నే భాషా రాష్ట్రంలో చేర్చడానికి ఎందుకు నిరాకరించాలని ప్రశ్నించారు. బొంబాయిజనాభాలో మహారాష్ట్రీయుల సంఖ్య తక్కువే ఉండవచ్చు. కాని కన్నడులు నూటికి 24 వంతు లేకున్నా బెంగుళూరును మైసూరులో, తెలుగువారు నూటికి 40 వంతు లేకున్నా హైదరాబాదును ఆంధ్రప్రదేశ్ లోనూ చేరుస్తున్నారు.

బొంబాయినగరానికి మంచినీటి సదుపాయం కోసం మహారాష్ట్ర ప్రాంతంనుంచి తెస్తున్న నీటిని సేద్యానికి వినియోగిస్తే సుమారు 11 లక్షల ఎకరాలు మహారాష్ట్రలో సేద్యం అవుతుంది. మహారాష్ట్ర కర్షకులకు 11 కోట్ల రూపాయలు ఆదాయం వచ్చేది.

బొంబాయికి విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చెయ్యడంకోసం నిర్మించిన కృత్రిమ సరస్సులలో 4 లక్షల 40 వేల ఎకరాల భూమి మహారాష్ట్రలో మునిగిపోయింది. బొంబాయిలో వాడుతున్న విద్యుచ్ఛక్తి మహారాష్ట్రలో ఉత్పత్తి అవుతుంది. దీనిపై పన్ను ఆదాయం అంతా కేంద్ర ప్రభుత్వానికి పోతుంది కాని మహారాష్ట్రకు లభించదు. బొంబాయినగరం మహారాష్ట్రకే చెందాలని మంత్రి శ్రీ హీరే వాదించారు.

### కన్నడులతో ఒప్పందం మాటల్తో కుదరదు

వివాదాలను ఉభయ పక్షాలూ ఒప్పందాలద్వారా పరిష్కరించుకోవాలని బిల్లులో సూచించారు. కాని కన్నడులు తమకు దక్కిన ప్రాంతాన్ని వదులుకోడానికి ఒప్పందానికి వస్తారనే మాట కల్ల. ఈ ఒప్పందం పద్ధతికి అవకాశమే లేదని శ్రీ హీరే అన్నారు.

సరిహద్దులు నిర్ణయించేటప్పుడు జిల్లాలూ తాలూకాలూ కాక గ్రామాలను బట్టి చూడాలన్నారు.

శ్రీ కాంతిలాల్ షా బొంబాయిలో ఆదాయం మిగులు మహారాష్ట్ర గుజరాత్ ల పల్లె ప్రాంతాలకు పంచాలన్నారు.

రత్నగిరి కొలాబా జిల్లాల కాంగ్రెస్ సభ్యులు బిల్లుకు ప్రతికూలంగా వోటు చెయ్యగలరని వారిలో ఒక సభ్యుడు ప్రకటించాడు.

### ఆక్షేపణ

భారత రాజ్య వ్యవస్థలో కేంద్ర పరిపాలిత ప్రాంతాలకు చోటు లేదంటూ, బిల్లు రాజ్యాంగ విరుద్ధం అని బొంబాయి ఎగువ సభలో ఒకరు ఆక్షేపణ లేవదీశారు. సభాపతి విరుద్ధం కాదని త్రోసిపుచ్చారు.

## మరోలీ కస్తూర్బా ఆశ్రమం రజతోత్సవం

సూరత్, ఏప్రిల్ 3: బార్డోలీ పన్నుల నిరాకరణోద్యమం రోజుల్లో స్థాపించిన మరోలీ కస్తూర్బా సేవాశ్రమం రజతోత్సవాన్ని కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ ఢేబర్ ఏప్రిల్ 6న ప్రారంభిస్తారు.

గాంధీమహాత్ముడు ఈ ఆశ్రమ భవనానికి 1932 లో శంకుస్థాపన చేశారు.

### ఆంధ్రులచే నూలు తీసే పద్ధతి

ఆంధ్రదేశంలో అతి సన్నని నూలు తీసే పద్ధతిని 1940 ప్రాంతాల గుజరాత్ దేశంలో ప్రవేశపెట్టినది ఈ ఆశ్రమం ద్వారానే.

# పెద్దప్రాజెక్టులలో పని మాంద్యం

## కేంద్రమంత్రి సమీక్ష: హీరాకుడ్ పూర్తయినట్లే

న్యూఢిల్లీ, ఏప్రిల్ 2: కేంద్రబడ్జెట్ నీటి పారుదల, విద్యుచ్ఛక్తి శాఖల పద్దుపై చర్చ లోక్ సభలో ఇవాళ ప్రారంభమైనప్పుడు మంత్రి శ్రీ నందా 1955-56 లో జరిగిన పని సమీక్ష చేశారు. పద్దు మొత్తం 4 కోట్ల 20 లక్షలు.

దాదాపు అన్ని రాష్ట్రాలలోనూ కొత్తగా సేద్యం కిందికి వచ్చిన భూమి 33 లక్షల ఎకరాలు. విద్యుచ్ఛక్తి యీ సంవత్సరం 2 లక్షల 30 వేల కిలోవాట్లు అదనంగా ఉత్పత్తయింది. కొద్ది మాసాలలో ఇంకో రెండు లక్షల కిలోవాట్లు అదనంగా ఉత్పత్తవుతుంది.

పెద్ద ప్రాజెక్టులపై ఖర్చు కొంత మందగించిందని మంత్రి శ్రీ నందా తెలియచేశారు.

హీరాకుడ్ ప్రాజెక్టులో మాత్రం దాదాపు ముఖ్యమైన భాగం ఆగస్టు నెలకి పూర్తయిపోతుంది. ఈ ప్రాజెక్టు వల్ల వెంటనే లక్ష ఎకరాల భూమి సాగులోకి వస్తుంది. 24 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి ఆరంభం అవుతుంది.

ఈ ప్రాజెక్టు నిర్మాణంలో విదేశీ నిపుణుల ఒక్కరి సహాయం కూడా తీసుకోలేదని శ్రీ నందా తెలియచేశారు.

భాక్రా ప్రాజెక్టులో రెండో విద్యుచ్ఛక్తి కేంద్రం నిర్మాణం (కోట్లావద్ద) జూన్ నెలలో పూర్తవుతుంది.

వరద నిరోధ కార్యక్రమాలకు ఈ సంవత్సరం రు 8 కోట్లవరకూ ఖర్చు పెట్టారు. కిందటేడు ఖర్చు పెట్టింది రు 2 కోట్ల 20 లక్షలు. సర్వే పని కొంత చురుగ్గానే సాగుతోంది.

### ఆరువేల మందికి వృత్తి పోవచ్చు

దామోదర్ లోయ ప్రాజెక్టు విషయం అసంతృప్తిగా ఉందని మంత్రి చెప్పారు. ఆరు మాసాలలో అక్కడ మొత్తం ఆరువేల మంది పనివారికి పని ఉండదు. వీరికి వీలయినంత వరకూ మరోచోట పని కల్పించడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుంది.

పద్దుపై చర్చలో కొందరు నదీలోయ ప్రాజెక్టు లన్నిటికీ జాతీయ నిర్మాణ సంస్థను నెలకొల్పాలని సూచించారు. ఒకరు ప్రతి రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి సంఘాలు స్థాపించాలన్నారు. నదులలో రవాణ వృద్ధి పరచాలని ఒకరు సూచించారు.

నీటి పారుదల, విద్యుదుత్పత్తి నిర్వహణను పరిపాలక శాఖనుంచి విడగొట్టి సాంకేతిక నిపుణులకు ఒప్పగించాలని ఒకరు సూచించారు.

దీనిపై లోక సభలో చర్చ—ఇవాళ పూర్తి కాలేదు.

## కాంగ్రెస్ అధ్యక్షుని తిరుకొచ్చి సంచారం

త్రివేంద్రం, ఏప్రిల్ 2: కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ ఢేబర్ ఏప్రిల్ ఆఖరు వారంలో తిరుకొచ్చిరాష్ట్రం పర్యటిస్తారు. 22 వ తేదీని అక్కడ రాజకీయ సభ ప్రారంభిస్తారు.

తిరుకొచ్చి కాంగ్రెసు రాష్ట్రంలో కాంగ్రెసు ప్రతిష్ఠను పునరుద్ధరించడానికి కార్యకర్తలను అన్ని జిల్లాలలో సంచారానికి పంపింది.

మంత్రివర్గ పతనానికి కారణమైన కాంగ్రెసు సభ్యులను సంజాయిషీ అడిగింది.

## పశువైద్య పరిశోధన

3 వ పేజీ 8వ కాలం తరువాయి

అంటారు.

* * *

ఇంతేకాదు. ఈ పశువైద్య పరిశోధనా పరిషత్తు భారతదేశంలోని విశ్వవిద్యాలయాలన్నిటికి అనుబంధ వ్యవస్థగా కూడా వ్యవహరిస్తున్నది. ఆయా విశ్వవిద్యాలయాలలో పశువైద్య శాస్త్రంలోనూ, సాధారణ రసాయన శాస్త్రంలోనూ పట్టభద్రులైనవారు ఉన్నత విద్య నభ్యసించి, డాక్టరేట్, ఎం. ఎస్ సి. డిగ్రీలు తీసుకోడానికి వీలుగా ఇక్కడ ప్రత్యేక శిక్షణ సౌకర్యాలనుకూడా ఏర్పాటుచేశారు. ప్రతి ఏడాదీ నిర్ణీతమైన సంఖ్యాపరిమితిలో విద్యార్థులకు స్థానాలు లభ్యమవుతున్నవి. సింహళం, బర్మా, మలయా, సయాం, చైనా మొదలైన ప్రాచ్య దేశాలనుంచి విద్యార్థులు వచ్చి పశువైద్య శాస్త్రంలో ఉన్నత విద్య నభ్యసిస్తున్నారంటే, అంతర్జాతీయంగా ఈ పరిశోధనాలయ ఖ్యాతిని అర్థం చేసుకోవచ్చు.

* * *

ఈ కేంద్రానికి సంబంధించిన పశుజనన శాస్త్రశాఖపై డాక్టర్ భట్టాచార్య అజ్మాయిషీ వహించి పనిచేస్తున్నారు. వీరు చాలా సమర్థులు. గేదెలకు, ఆవులకు కృత్రిమ మార్గాన ప్రత్యేక పరికరాలతో పిండోత్పత్తి కలిగించి, దేశంలో మేలిరకం పశుసంతతిని పెంపొందజేయడానికి కొత్తకొత్త పరిశోధనలు చేస్తున్నారు. బలిష్ఠమైన ఒక ఆంబోతునుంచిగాని, ఒక దున్నను౦చిగాని సేకరించే పశు ఇంద్రియం 80 గేదెలలో, 30 ఆవులలో కృత్రిమ గర్భధారణకు ఉపయోగపడుతుందట. ఆంబోతులు తగినన్ని లేని మనదేశంలో ఈ పరిశోధనల్ల ఎంత ప్రయోజనం చేకూరుతుందో ఊహించవచ్చు.

కోళ్ల పెంపకం శాఖ అధిపతి శ్రీ ఎస్. జి. అయ్యర్ బహు సమర్థుడు; మంచి మాటకారి. రకరకాల ఆహారంవల్లా, ఉత్తమపోషణవల్లా పోరులమాదిరిగా బలిసి, పరిశోధన కేంద్ర ఆవరణంలో బహు అందంగా, ఠీవిగా తిరుగుతున్న పుంజులను ప్రతికా ప్రతినిధుల బృందానికి చూపించి, "ఇదంతా నా పటాలం; పరిశోధనా సామగ్రి" అన్నారు అయ్యరుగారు.

ప్రస్తుతం మనదేశంలో కోళ్ల సంఖ్య కోట్లలో వున్నప్పటికీ, తయారవుతున్న గుడ్ల సంఖ్య మాత్రం స్వల్పమేనని ఒప్పుకోవాలి. ప్రతిపౌరుడూ తన ఆహారంలో విధిగా కోడిగుడ్లను తినడం మొదలుపెడితే, ఏడాది పొడుగునా పగటున నాల్గు గుడ్లకంటే ఎక్కువ రావుట. ఇంగ్లండులో మనిషికి సగటున ఏడాదికి 400 గుడ్లు ఇవ్వడానికి వీలుగా ఉత్పత్తి సాగుతున్నది. 1963 నాటికి ప్రతి భారతీయునికీ రోజుకు కనీసం ఒక గుడ్డు (అంటే ఏడాదికి 365 గుడ్లు) లభ్యమయేటంతగా ఉత్పత్తి పెంచాలనే దీక్షతో తమ శాఖ పని చేస్తున్నట్లు అయ్యర్ గారు తెలియజేశారు.

* * *

మన ఇళ్ళలో మామూలుగా గేదెలు ఆవులు రోజుకు మూడు నాల్గు శేర్ల పాలు ఇస్తే అది గొప్ప. వాటి ఆహార విషయంలో మన వాళ్లు చూపే అశ్రద్ధే ఇందుకు చాలావరకు కారణం. పాశ్చాత్య దేశాలలో పశువులకు పెట్టే ఆహారానికీ, మన దేశంలో పెట్టే ఆహారానికీ చాలా వ్యత్యాసం వున్నదని గ్రహించారు. "మానవులకు ఉన్నది పుష్టి, ఆలకు తిన్నది పుష్టి" అంటారు. మనం ఇక్కడ పశువులకు వేసే మేతలో మాంసకృత్తు పదార్థమైన "ప్రోటీన్" లోపం ఎక్కువగా వున్నదట. మనిషి ఆహార సమస్యే అతి గడ్డు సమస్యగా వున్న మన దేశంలో, పశువుల ఆహార విషయమై అశ్రద్ధ చూపడంలో ఆశ్చర్యమేమీ లేదు. అయితే, "నూతన్ంలో పోతంగా" కనబడే పనులు కూడా మనవాళ్లు చేయరు. మామిడి టెంకలలో వుండే జీడి పశువులకు చాలా బలవర్ధకమైన ఆహారంగా ఉపయోగపడుతుందని కనిపెట్టారు. సాధారణంగా వాటిని పెంటకుప్పలోకి చిమ్మివేస్తారు గాని, మనవాళ్ళు వాటిని ఉపయోగించరు. ఈ పరిశోధనల ఫలితంగా ఇజత్ నగర్ కేంద్రంలో ఒక పశువు రోజుకు ౧౮ పౌనుల వరకూ పాలు ఇచ్చిందట.

* * *

ఇంతేకాదు. సాధారణంగా దున్న పోతులతో భూమి దున్ని వ్యవసాయం చేసేవాళ్లు ఒక్కొక్కప్పుడు 'ఈ నాగటిని గొడ్డువాటు గేదెలను' కొడికెకట్టి పని చేయించే ఆచారాన్ని మనం అక్కడక్కడ చూస్తుంటాము. అంతేగాని, ఆవులు మూడ్యు ఇటు పాడిచినా, ఆవును మాత్రం అరకకు కట్టి పని చేయించడం. గోమాత అంటే మనకున్న గౌరవప్రపత్తి అలాంటిది.

కాని, ఇజత్ నగర్ పశుగణాభివృద్ధి కేంద్రంలో ఆవులజతను అరకకు కట్టి, ఆవరణంలోనే కొంత భూమిని దున్నిస్తున్నారు. ఈ విధంగా పని చేయించడం వల్ల ఆవులలో ఏదైనా విచిత్రమైన మార్పు వస్తుందేమో ప్రత్యక్షంగాపరిశీలించి తెలుసుకోవడమే ఉద్దేశం.

ఎద్దులు చేసే పనిని చేయిస్తున్నప్పటికీ, ఆవులు యథాప్రకారంగానే పాలు ఇస్తూనేవున్నవి. అయితే, పాపం, అలవాటులేని పనిని చేయించడంవల్లనో ఏమో, ఆవుల బరువు తగ్గిపోతున్నట్లు తెలుసుకున్నారు. ఇంతకు మించి గమనార్హమైన పెద్ద మార్పేమి రాలేదు.

* * *

ప్రస్తుతం ఇజత్ నగర్ కేంద్రానికి డైరెక్టర్ గాపనిచేస్తున్న డాక్టర్ లక్ష్మీ సహాయ్ పశువైద్య శాస్త్రంలో విశేషానుభవం గడించిన ప్రవీణుడు. ఒకవైపు ప్రత్యేకంగా ఒక శాఖలో పరిశోధన సాగిస్తూ, మరోవైపు, వివిధ శాఖాధిపతుల పరిశోధనా కార్యకలాపాలను సమన్వయం చేస్తుంటారు. ఈ కేంద్ర పరిపాలనా నిర్వహణ బాధ్యత అంతా వీరిదే, ఎంత చిన్న ప్రశ్నను వేసిన, ఎంత చిన్న ప్రశ్నను అడిగినా చిరాకు పడకుండా, చిరునవ్వుతో సమాధానం ఇచ్చే స్వభావం వీరిది. ఒక్కసారి పరిచయమైతే వీరి సహజ మందహాస ధోరణి ఎవరూ మరచిపోలేరు.

ద్వితీయ ప్రణాళికా కాలంలో ఇజత్ నగర్ పశువైద్య పరిశోధనా కేంద్రాన్ని మరో రెండు కోట్ల ధనం వెచ్చించి అభివృద్ధి చేయాలని సంకల్పించారు. తయారవుతున్న, వివిధ ఔషధాలకు వాటివాటి నాణ్యతను బట్టి ప్రమాణం స్థిరీకరింపడానికి ఒక ప్రత్యేక శాఖ ఏర్పాటు చేయబోతున్నారు. దేశం మొత్తం మీద పశువులలో ఎక్కడా పారుడు వ్యాధి అనేది రాకుండా వచ్చే ఐదేళ్ళలో చేయాలనే దీక్షతో పనిచేస్తున్నారు.

పశుగణాభివృద్ధికీ, దేశఆర్థికవ్యవస్థకు అవినాభావ సంబంధం వున్నది కాబట్టి, ఇజత్ నగర్ కేంద్రం దేశ క్షేమానికి అమోఘమైన సేవ చేస్తున్నదనడంలో అతిశయోక్తి ఏమీ లేదు. పశువైద్య పరిశోధనా ఫలితాలు సామాన్య ప్రజలకు ఇంకా బాగా అందుబాటులోకి రావాలంటే, ఇలాంటి కేంద్రాలను మరికొన్నిటిని ప్రభుత్వం ఏర్పాటు చేయడం అవసరమనే విషయాన్ని గుర్తించాలి.

# ఖిలాయ్ కర్మాగారానికి రు 55 కోట్ల సామగ్రి

## ఒప్పందంపై సంతకాలు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 2: ఖిలాయ్ ఉక్కు కర్మాగారానికి సుమారు రు 55 కోట్ల విలువగల యంత్రాలు, పరికరాల సరఫరాకు ఒక ఒప్పందం కుదిరింది. రష్యా ఇనుము ఉక్కు శాఖ తరఫున శ్రీ లెవ్నికోవ్, శ్రీ సెజీవ్, భారత ప్రభుత్వం తరఫున శ్రీ ఎస్ భూతలింగం సంతకాలు చేశారు.

ఈ మొత్తాన్ని 12 వార్షిక వాయిదాలలో చెల్లించవలసి వుంటుంది. వడ్డీ 100 కి 2½ మాత్రమే. జూన్ లో మొదటసారిగా కొంత సామగ్రి దిగుమతి అవుతుంది. 1959 మధ్య కాలానికి సరఫరా పూర్తవుతుంది. 1959 ఆఖరుకి పూర్తి ఉత్పత్తి ప్రారంభమవుతుంది.

ఈ రు 55 కోట్లలో రవాణా చార్జీలు సామగ్రి భీమా అన్నీ చేరివున్నాయి. రవాణా, భీమా ఏర్పాట్లు "టెక్నో ఎక్స్ పోర్ట్" అనే సోవియట్ సంస్థ చేస్తుంది. సామగ్రి అంతా విశాఖరేవుకు చేరుకుంటుంది.

## రష్యాలో తిరిగి అణ్వస్త్ర పరీక్ష

### అమెరికా అణుశక్తి సంఘ ప్రకటన

వాషింగ్టన్, ఏప్రిల్ 2: ఇటీవల సోవియట్ యూనియన్ మరొక అణు పరీక్ష జరిపిందని అమెరికా అణుశక్తి సంఘాధ్యక్షుడు స్ట్రాస్ నేడు ప్రకటించారు. గత 8 నెలల్లోను ఇది 6 వ పరీక్ష అని ఆయన అన్నారు. అయితే ఇది స్వల్పం చలిత అణువిచ్ఛేదక ప్రక్రియో ఉష్ణజనిత అణువిచ్ఛేద ప్రక్రియో మాత్రం ఆయన తెలియజేయలేదు.

## "నేనే ప్రధానిని, నన్నెవ్వరూ ఆపలేరు"

### సింహళ ప్రతిపక్ష నాయకుని ప్రసంగం

కొలంబో, ఏప్రిలు 2: "నేనే ప్రధానమంత్రి నౌతున్నాను. నన్నెవ్వరూ ఆపలేరు" అని శ్రీలంక (సింహళ) ప్రతిపక్ష నాయకుడు శ్రీ భండారనాయక్ ఇక్కడ ఒక ఎన్నికలసభలో ప్రకటించారు. ఎన్నికల్లో తమపక్షం గెలిచితీరుతోందన్నారు. ఎన్నికలు ఇంక మూడు రోజుల్లో జరుగుతాయి.

మొదట సింహళభాష ఒక్కటే రాజభాషగా గుర్తించాలనే అంశంపై వివాదం తేల్చుకోవాలనే ఉద్దేశంతో ప్రభుత్వపక్షం ఈ ఎన్నికలు తెచ్చిపెట్టినా, మతం, ధాన్యంధరలు మొదలైనవన్నీ వచ్చాయి. ప్రతిపక్షాలను బౌద్ధులు బలపరుస్తున్నారని, క్రైస్తవులైన ప్రస్తుత ప్రధానమంత్రి ఆరోపించారు. ప్రతిపక్షాన్ని కమ్యూనిస్టుపార్టీ, సామసమాజ్ (ట్రాట్స్కీ) పార్టీ కూడా బలపరుస్తున్నాయి.

## పోటీ బహుమతుల చట్టం ఏప్రిల్ 1 నుంచీ అమలు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 2: పోటీ బహుమతుల మొత్తాలు నెలకు రు 1000 రూపాయలకు మించరాదనే కేంద్ర శాసనం ఏప్రిల్ 1 ఆదివారంనుంచీ అమలులోకి వచ్చిందని ప్రభుత్వ గెజెట్ ప్రకటించింది.

## అమెరికాలో కమ్యూనిస్టు ఆస్తుల జప్తి

న్యూయార్కు, ఏప్రిల్ 2: న్యూజెర్సీ రాష్ట్ర కమ్యూనిస్టుపార్టీ స్థిరచరాస్తులను యావత్తూ ఖజానా శాఖాధికారులు నేడు స్వాధీనపరచుకున్నారు. కమ్యూనిస్టు పార్టీ, పార్టీ పత్రిక డెయిలీ వర్కర్ పన్నులను కట్టలేదని అధికారులు ఆరోపించారు.

















చిప్పగిరినుంచి గుంతకల్లు పొలిమేరలలోకి వచ్చిన వినోబాజీకి గ్రామప్రముఖులు సాదరంగా స్వాగతం చెప్తున్నారు.

వినోబాభావే గుంతకల్లు గ్రామపుస్థలస్థలిలో మార్చి 29 న ప్రసంగించారు.

మద్రాసులో రష్యా వ్యాయామ నిపుణులు చూపడం, దూలంమీద వివిధ వ్యాయామక్రీడలు చేయడం— మొదలైనవి ప్రదర్శించారు.

# ఆంధ్ర తెలంగాణా విలీన సమస్యలు

## అక్టోబరులోగా జరిగే తతంగంపై ముఖ్యమంత్రి వివరణ

కర్నూలు, ఏప్రిల్ 3: ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల విలీనానికి సంబంధించిన వ్యవహారం యావత్తూ అక్టోబరులో పూర్తిగా పూర్తి కాదని, అంతవరకూ ఏమీ చేయకుండా ఉండటానికి వీలు కాదని, కేంద్రప్రభుత్వ ఉత్తర్వుల ననుసరించి, కార్యక్రమం నడుపుకొంటూ పోవాలని ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, నిన్న రాష్ట్రాల పునర్నిర్మాణబిలును ప్రతిపాదిస్తూ చెప్పారు. (వీరి ప్రసంగించాలా భాగం నిన్ననే ప్రచురించాము-సం)

ముఖ్యమంత్రి యింకా యిలా అన్నారు. "అక్టోబరులోగా చేయవలసిన పని చాలా ఉన్నది. ఉద్యోగులు వెళ్లి హైదరాబాదు వెళ్ళి అక్కడ ఉద్యోగుల విభజన ఎలా జరుగుతుందో చూడవలసి ఉన్నది. వారిని యిక్కడ సిబ్బందితో సమన్వయం చేయవలసి ఉన్నది. ఆస్తి అప్పులు పంచుకోవడం జరగాలి. ఈ సందర్భంలో భారత ప్రభుత్వం, ఒకరిద్దరు ఉద్యోగులను పంపవచ్చు. మన ఉద్యోగులు వారి ఉద్యోగులు కలసి పని చేయాలి. ఇవన్నీ అక్టోబరులోగా పూర్తికావు"

హైదరాబాదులో జీతాలు ఎక్కువ అని, సిబ్బంది అదనంగా ఉన్నది అని, వింటున్నాము. వ్యక్తులకు సంబంధించిన సమస్యలు అనేకము ఉన్నవి. వాటిని పరిష్కరించుకోవలసి ఉన్నది.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక విషయం ప్రస్తావిస్తు, ప్రణాళిక ప్రజలందరికీ సంబంధించినది. రాష్ట్ర పునర్నిర్మాణాల ప్రణాళికకు అడ్డురాకుండా చూసుకోవాలి అన్నారు.

"ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల జనాభాలో మూడోవంతు ఆక్రమించుకొంటుంది. ఇది చాలా శుభసూచకము. మన మాగాణము విస్తీర్ణము అవుతున్నది, దానితోబాటు బాధ్యతలుకూడా పెరుగుతున్నవి. అది గమనించి మనం నడుచుకోవాలి. ఆంధ్రప్రదేశ్ భారతములో మిన్న అయిన రాష్ట్రమై, కీర్తిప్రతిష్ఠలు సంపాదించ గలరని ఆశిస్తున్నాను" అని ముఖ్యమంత్రి అన్నారు.

శ్రీ లక్ష్మణదాసు సరిహద్దుల విషయమై ఏమైనా చెబుతారా అని అడుగగా, ముఖ్యమంత్రి యిలా చెప్పారు:

"ఇదిఒక గడ్డుసమస్య. రాష్ట్ర పునర్విభజన సంఘము కొన్ని నిర్ణయాలకు, భారతప్రభుత్వం కొన్ని నిర్ణయాలకు వచ్చారు.

బళ్లారి విషయంలో, రాష్ట్ర విభజన సంఘమువారి సిఫార్సుకు వ్యతిరేకముగా, భారత ప్రభుత్వం తీర్పు యిచ్చింది. పర్లాకిమిడి కోలారు విషయాలలో, ఉన్నది, ఉన్నట్టుగా ఉంటే బాగుంటుందని అన్నారు. సవరణలు తెచ్చి, వాతావరణాన్ని కలుషితము చేయడముకంటే, ఒక సరిహద్దు సంఘాన్ని నియమించడము బాగుంటుంది అనుకొంటున్నాము. పర్లాకిమిడి విషయంలో దాసుగారి ఉద్రేకము నాకు తెలుసు. వారు అనేకసారులు మాట్లాడారు. కోలారు విషయంలో అన్యాయం జరిగిందిఅని సుందరయ్యగారు అన్నారు. న్యాయముగా రావలసిన తెలుగుప్రాంతాలు, ఆంధ్రరాష్ట్రానికి రాలేదు అనే భావము పూర్తిగా ఉన్నది.

బస్తరులో రావలసినభాగాలుకూడా ఉన్నవి. ఇవన్నీ న్యాయమైన కోర్కెలే. అయితే, యితర భాషవారుకూడా కలిసి ఉండడము జీవితము మధురముగా ఉంటుంది అనే భావముకూడా ఉన్నది. తాలూకాలు గ్రామాలుగురించి ఆందోళనపడవలసిన అవసరము లేదు. బళ్లారి సభ్యుడు శ్రీ ముండ్లూరి గంగప్ప, మైసూరు శాసనసభ సభాపతికి తమ రాజీనామా పంపి ఆందోళన చేస్తున్నారు. అక్కడ ఒక ఉపఎన్నిక జరుగుతుందేమో తెలియదు ఈ సమస్యమీద జరుగవచ్చు. ఈ విషయంలో ఏమిచేయడానికి వీలున్నదో చూడాలి. ఏది ఏమైనా, యిలాంటి విషయంలో, శాంతముగా, ఉదారముగా మాట్లాడడము మంచిది.

### సుందరయ్య విమర్శ

చర్చను ప్రారంభిస్తూ, ప్రతిపక్ష నాయకుడు శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య యిలా అన్నారు:

"అలస్యమైనా విశాలాంధ్ర ఏర్పడుతున్నందుకు సంతోషం. అందుకు ప్రతి ఆంధ్రుడు హర్షిస్తాడు. ఈ సంతోషంలో యీ బిల్లులో లోపాలు మరువకూడదు. బహు భాషా రాష్ట్రాలు ఏర్పాటుచేయుటకు, కావలసిన ప్రాతిపదికలన్నీ యీ బిల్లులో ఉన్నవి. ప్రాంతీయమండలులద్వారా ఒకచేతితో యిచ్చి, యింకొక చేతితో లాక్కుంటున్నారు.

విశాలాంధ్రకు ప్రమాదకరమైన సూచనలు ఏమిఉన్నవో చెప్పవలసిఉన్నది. ఒకే హైకోర్టు విషయంలో తెలంగాణా నాయకులతో ఒప్పందము కుదురగలదని అనుకొంటున్నాము. హైకోర్టు రాజధానిపక్కనే ఉండడము అవసరము. ఒకటి రెండు రాష్ట్రాలకు కలిపి, హైకోర్టు ఉండవచ్చునని బిల్లులో ఉన్నది. ఇప్పటి రాజ్యాంగములో ప్రతిరాష్ట్రానికి ఒక హైకోర్టు ఉండాలని ఉన్నది. ఈ సవరణను పూర్తిగా వ్యతిరేకిస్తాము.

ఒకటి రెండు రాష్ట్రాలకు కలిపి ఒకే హైకోర్టుఉండాలని అంగీకరించినచో ప్రాంతీయ మండలిలో ఉన్న రాష్ట్రాలన్నింటికి కలిపి, ఒకే హైకోర్టు ఉండవచ్చునని అనవచ్చు. ఈ సరళి దేశ ఐక్యతకే భంగకరము. ఎంత త్వరగా తీసివేస్తే అంతమంచిది. రెండు రాష్ట్రాలకు కలిపి ఒకే గవర్నరును నియమించవచ్చునని సవరణకూడా, ప్రాంతీయరాష్ట్ర నిర్మాణమునకు పునాదిగానే మేము భావిస్తున్నాము. గవర్నరు పదవిని రద్దుచేసి, ఆ పనిని కూడా రాష్ట్రపతే నిర్వహించాలని మా సూచన. కొందరిఅనుమానము తీర్చుటకు ప్రాంతీయ మండలుల యేర్పాటును అంగీకరించాము. కాని వానిలో గవర్నరు ప్రమేయము ఏమీ ఉండకూడదు. మండలులకు శాసనసభకు అభిప్రాయభేదము వచ్చినపుడు భారత ప్రభుత్వమువారే పరిష్కరించాలని మా అభిప్రాయము.

ఈ విషయము, యీవల కర్నూలులో జరిగిన నాయకులసమావేశములో కూడా స్థూలముగా అంగీకరించారు. ఈ సందర్భములో ముఖ్యమంత్రి, తమ దర్యాప్తుచేసుకొంటారని ఆశిస్తున్నాము. మా ప్రాంతములో వసూలు అయ్యే ఆదాయమంతయూ మా ప్రాంతములోనే ఖర్చు చేయాలని తెలంగాణా నాయకులు కోరటం, కేవలం సంకుచితభావం అని అభిప్రాయం.

తెలంగాణా క్షేమము కోరేవా రెవరూ అలాకోరరు. ప్రాంతీయమండలులు పూర్తిగా నిరుపయోగము, నిరర్థకము అని నాఅభిప్రాయము.

ముఖ్యమంత్రి: పుట్టక ముందే విమర్శ.

సుందరయ్య: దుష్టమైనవానిని పుట్టకముందే సంహరించడం మంచిది. దీని వలన ప్రాంతీయభావము రెచ్చగొట్టబడుతున్నది. ఒకరాష్ట్రానికి, మరొక రాష్ట్రానికి సంబంధము లేనివానిని ఒక ప్రాంతీయమండలిలోఉంచి పరిపాలనా సమస్య పరిష్కారానికి అని అనడము, హాస్యాస్పదము.

భాషాప్రయుక్త రాష్ట్రముల మరూపుమాపుటకు ప్రాంతీయ మండలి రాష్ట్రాలను ఏర్పాటుచేయుటలపెట్టారు. కనుక ఈసూచనను పూర్తిగా వ్యతిరేకిస్తున్నాము.

"సరిహద్దులు సరిచేయమని అనడం సామ్రాజ్యకాంక్ష కాదు. దేశములో, ప్రజలు ముందుకుపోవాలంటే వివిధ భాషలవారిమధ్య, ఘర్షణ లేకుండా ఉండాలంటే, సాధ్యమైనంత వరకు ఇతరభాషలవారు తక్కువగాఉండాలి. ఆవిధముగా చూస్తే మైసూరులోని కోలారు, పావగడ మనకు రావాల్సి వుంది. పర్లాకిమిడి విషయంలో ఆందోళన కొనసాగనివ్వడము మంచిదికాదు. రాష్ట్రాలు ఏర్పడుటకు పూర్వమే, మదరాసు, సరిహద్దులు తేలిపోవాలి.

తెలంగాణాలోని సిర, మద్దల్ సిరవంచ తాలూకాలు ఆంధ్రప్రదేశ్ లో కలపడం న్యాయము. సరిహద్దులనిర్ణయానికి వెంటనే ఒక సంఘాన్ని వేయడం అవసరము. అదిగాక యితర భాషలకు చెందిన ప్రజలు ఏ రాష్ట్రంలో ఉన్నా, విధిగా మాతృభాషలో విద్యాబోధన జరిగేట్లు చూడాలి. ఈ విషయమైకూడా ఒక సవరణ ప్రతిపాదించదలచాము"

శ్రీ రాజసాగి సూర్యనారాయణ కూడ, ప్రాంతీయ మండలుల నిర్మాణానికి వ్యతిరేకత తెలిపారు. హైకోర్టు హైదరాబాదులోనే ఉండాలి కాని, విడిగా, ఒకశాఖ మరొకచోట ఉంచవక్కరలేదని ఆయన అన్నారు. ఫజులాలీ సంఘ సిఫార్సుల మేరకు బళ్ళారిని ఆంధ్రలో కలపాలని కోరారు.

శ్రీ కాశీశ్వరరావు మాట్లాడుతూ రాష్ట్రాల మధ్య వివాదాల పరిష్కారానికి, ప్రాంతీయమండలులు అవసరమని అన్నారు.

కొత్తరాష్ట్రానికి ఆంధ్రప్రదేశ్ అనే పేరు ఆమోదించాల్సిందిగా, తెలంగాణా నాయకులకు విజ్ఞప్తి చేశారు. నూతన రాష్ట్రానికి ఎగువ శాసన సభ ఉండాలని, తెలంగాణావారే సూచించారు గనుక, ఆంధ్రనాయకులు ఆ సూచనను ఆమోదించాలని శ్రీ కాశీశ్వరరావు అన్నారు.

ఇరుగు పొరుగు రాష్ట్రాలలో ఆంధ్ర ప్రాంతాలను, సరిహద్దు నిర్ణయ సంఘం నియమించవలసిన పని లేకుండానే, ఆంధ్రలో చేర్చాలని ఆయన కోరారు.

శ్రీ నాగినేని వెంకయ్య, హైకోర్టు శాఖ ఒకటి గుంటూరులో ఉండాలని కోరారు.

శ్రీమతి అమ్మణ్ణ రాజా ప్రాంతీయ మండలులు నిర్మాణం తగదని, రాష్ట్రాల మధ్య వచ్చే తగాదాలు, కేంద్రమే తీర్చగలుగుతుందని అన్నారు.

## భారత పాక్ సంఘర్షణలు

### రెండువారాలైనా కరాచీ జవాబులేదు

కరాచీ, ఏప్రిల్ 2: సరిహద్దు సంఘటనలను గురించి, భారత ప్రభుత్వం ఆక్షేపణపంపి రెండు వారాలైనా, పాకిస్తాన్ యింతవరకు సమాధానం పంపలేదని, అభిజ్ఞవర్గాల ద్వారా తెలిసింది.

భారతసైన్యాలే సరిహద్దులను అతిక్రమించాయని, పాకిస్తాన్ రాజకీయ నాయకులు, పత్రికలు ఆరోపణలు చేస్తున్నా, భారతప్రభుత్వ ఆక్షేపణలకు, పాకిస్తాన్ ప్రభుత్వం యింతవరకు సమాధానం పంపకపోవడం గమనార్హం అని, వీరు అంటున్నారు.







## టాంగన్యీకా స్వాతంత్ర్యానికి గడువు

### ధర్మకర్తృత్వ సంఘ తీర్మానం

న్యూయార్క్, ఏప్రిల్ 2: తూర్పు ఆఫ్రికాలో బ్రిటిష్ ధర్మకర్తృత్వం కింద ఉన్న టాంగన్యీకాకు స్వాతంత్ర్యం ఇవ్వటానికి బ్రిటన్ ఒక తేదీని నిర్ణయించాలని ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వమండలి నేడు ఆదేశించింది. స్వపరిపాలనకు ఒక కార్యక్రమం కూడా తయారు చేయాలని ధర్మకర్తృత్వ మండలి సూచించింది.

ఈ ప్రతిపాదనలను బ్రిటన్ తీవ్రంగా ప్రతిఘటించినా లాభం లేకపోయింది. భారతదేశం మొదలైన ఎనిమిది దేశాలు తీర్మానాన్ని బలపరచగా, వలస దేశాలయిన బ్రిటన్, ఫ్రాన్సు, బెల్జియం, ఆస్ట్రేలియా, న్యూజిలాండులు ప్రతిఘటించినవి. ఇటలీ ... అమెరికా తీర్మానాన్ని బలపరిచింది.

టాంగన్యీకాలో అభివృద్ధి క్రమం ... గానే ఉన్నదని ధర్మకర్తృత్వ మండలి సంతృప్తి పడుతూ, ఒక కార్యక్రమాన్ని నిర్ణయించి, స్వాతంత్ర్యానికి ఒక గడువు నిర్ణయించాలని ... సించింది.

గడువు నిర్ణయించటం టాంగన్యీకా ప్రజల్లో విశ్వాసాన్ని కలిగిస్తుందని భారత ప్రతినిధి ఉద్ఘాటించారు.

## సాంకేతిక విద్యకు రు 50 కోట్లు

బొంబాయి, ఏప్రిల్ 2: సాంకేతిక విద్యాబోధనకు ద్వితీయ ప్రణాళికలో రు 50 కోట్లు ప్రణాళికా సంఘం కేటాయించిందని సహజ సంపదలశాఖ కార్యదర్శి శ్రీ యం. యస్. థాకర్ నేడు సాంకేతిక విద్యావిషయిక ప్రదర్శనను ప్రారంభిస్తూ వెల్లడించారు.

ఈ ప్రదర్శనను గోఖలే ఇన్‌స్టిట్యూట్ ఏర్పాటు చేసింది. సాంకేతికవిద్యప్రాముఖ్యాన్ని శ్రీ థాకర్ వివరించారు. సాంకేతిక సిబ్బందికిగల ప్రాముఖ్యం దృష్ట్యాపారిశ్రామిక శక్తులు ఏవయినా ఒకసంస్థను నెలకొల్పి శిక్షణ సౌకర్యాలు కలుగ చేయాలని కోరారు.

## ఆందోళన అనవసరం

### ఏకీకరణ సమస్యపై శ్రీ నెహ్రూ అభిప్రాయం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 2: బెంగాల్ బీహార్ ఏకీకరణ గురించి ప్రజలంతగా కలవరం చెందడానికి అదేమీ అంత ముఖ్యసమస్య గాదని శ్రీ నెహ్రూ నేడు విలేఖకుల గోష్ఠిలో అన్నారు.

"ప్రజాభిప్రాయం ప్రకారంగా మనం నిర్ణయం చేయవలసి వున్నది. ఈ ప్రతిపాదన గురించి ప్రస్తుతం ఆలోచిస్తున్నాం. ఏ రెండు రాష్ట్రాలు ఏకం కాదలచుకున్నా, లేకపోయినా భారత ప్రభుత్వం అంతగా ఆందోళన చెందదు. అందుకనే యీ ఏకీకరణ సమస్యను బిల్లులో చేర్చలేదు. విడిగానే దానిని చర్చిస్తున్నాం. ఆర్థిక ప్రయోజనాలు, సాంస్కృతిక సంబంధాలు వాటి దృష్ట్యా ఏకీకరణ సమస్య పరిశీలించాలి, కనుక ప్రజలు ఆందోళన చెందనక్కరలేదు" అన్నారు.